# కుమార
# రుద్రదేవకవి



అనుముల సుబ్రహ్మణ్యశాస్త్రి

# ప్రస్తావన

ఆంధ్ర సాహిత్య చరిత్రకారులు భాస్కర రామాయణమును గూర్చి గావించిన చర్చలలో తద్గ్రంథ రచయిత హుళక్కి భాస్కరుడా?-మంత్రిభాస్కరుడా ? యను విషయమునకు ప్రాధాన్యత నొసంగినారు. కొందరు అయోధ్యకాండ రచయిత భాస్కరుని శిష్యుడని మాత్రము వ్రాసిరి. కాని "సకల కలా విశారద శారదాముఖ ముకురాయమాణ సారస్వత భట్టబాణ నిశ్శంక వీరమారయ" కుమారుడైన రుద్రదేవుని గూర్చి పరిశీలించినట్లు కన్పించదు. సాహిత్య చరిత్రకారులచే స్వల్ప మాత్రుడని విడువబడిన అజ్ఞాత ఆంధ్రమహాకవి "కుమారరుద్రదేవకవి"ని గూర్చిన సమగ్రమైన పరిశోధన మొనర్చి, అతని చరిత్రను వెలువరించుటయే ఈ గ్రంథ రచనోద్దేశ్యము.

ప్రాచీన గ్రంథములను, శాసనములను సంవత్సరముల తరబడి పరిశీలించి, సునిశితమైన తార్కిక పటిమతో ఈ చిన్నపుస్తకమునందు శ్రీ శాస్త్రిగారు కొన్ని విషయములను నిర్ధారించినారు.

౧. "కుమారరుద్రదేవకవి" కాకతి చక్రవర్తి ప్రతాపరుద్రుడే కాని అన్యుడు కాడు.

౨. భాస్కర రామాయణ కృతిపతి "సాహిణి మారయ" ప్రతాపరుద్రుని జనకుడు. రుద్రమదేవి మహారాణికి అల్లుడు.

౩. ప్రతాపరుద్ర మహారాజు యువరాజుగ నున్న కాలమున కుమారరుద్రదేవుడను పేర బరగెను. తన తండ్రికి అంకితమొనర్పబడుటకై భాస్కరాదులచే రచింపబడుచు, కారణాంతరములచే అసంపూర్ణ స్థితియందు ఆగిపోయిన రామాయణమున అయోధ్యకాండమును పూరించెను.

ఈ విషయములను శ్రీ శాస్త్రిగారు నిదర్శనపూర్వకముగ ఋజువుచేసి, "అయినను దీనిపై నింతకంటె సరియైన నిర్ణయ మెవ్వరైనఁ జేయఁగలిగినచో నాకంటె సంతోషింపఁగలవారు మరియొకరుండరని విజ్ఞులకు నివేదించుకొనుచున్నాను" అని మనవిచేసియున్నారు. సహృదయులైన చరిత్రకారులు, విమర్శకులు, సాహితీప్రియులు, సత్యాన్వేషణ గావింప ప్రార్థన.

10-4-59

సాహిత్య సంసత్

జనగామ.

# నివేదన

ఆంధ్ర సాహితీ ప్రపంచమునకు "కుమార రుద్రదేవ కవి" అను నీ గ్రంథమును కానుకగా నొసంగు నీ శుభ సమయమున తద్రచయిత బ్రహ్మశ్రీ అనుముల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు మనతో లేకుండుట విశేష వేదనావహము.

సుకవి, విమర్శకుడు, మహాపండితుడు, నిరాడంబరజీవి అగు శ్రీ శాస్త్రిగారు స్వర్గీయ శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారికి ప్రియ మిత్రులు. భ్రాతృతుల్యులు. తెలంగాణ పునరుజ్జీవమునకు వారిరువు రొనర్చిన సేవ సర్వులకు విదితమే.

"సాహిత్యసంసత్" సమావేశములో శ్రీ శాస్త్రిగారు దాదాపు రెండు గంటలు "కుమార రుద్రదేవి కవి" ని గూర్చి గంభీరోపన్యాస మొనర్చుటయు, డెబ్బది వర్షముల ప్రాయమున వా రొసంగిన ఆ మహోపన్యాసమునకు ముగ్ధులైన మా పురజనులు' తద్గ్రంథీప్రకట నోద్యమమునకు "సంసత్" పూనుకొనవలయునని కోరుటయు, తదాది "సంసత్" కార్యనిర్వాహకులు శ్రీ గౌరిపెద్ది రామకృష్ణరావు ముద్రణావ్యయమును అనేక శ్రమల కోర్చి సేకరించుటయు, అజంతా ప్రింటర్సు, సికిందరాబాదువారు ముద్రణ ప్రారంభించుటయు తటస్థించి నది. గ్రంథ ముద్రణ పూర్తియై, పీఠిక వ్రాయుచుండగనే శ్రీ శాస్త్రి గారు పరమపదించినారు. అది మా దురదృష్టము.

ఒక అజ్ఞాత ఆంధ్ర మహాకవి చక్రవర్తి చరిత్రము, కవితా విశేషములు ప్రచురించు భాగ్యము కల్పించిన స్వర్గీయ శ్రీ శాస్త్రి గారికి, సర్వవిధముల సహకరించిన జనగామ పౌరులకు ప్రతిక్షణం మమ్ము ప్రోత్సాహపరచిన శ్రీ హర్కారే వేంకట శ్రీనివాసరావు

పంతులుగారికి, సకాలంలో సొగసుగా ముద్రించిన ముద్రాపకులకు, సంసత్ సభ్యులకు, శాస్త్రిగారి ప్రియశిష్యులు శంకరయ్యగారికి, అపార దుఃఖంలో మునిగిఉండియు, మా ప్రయత్నాలకు సర్వవిధముల సహాయ మొనర్చిన శాస్త్రిగారి పుత్రులు శ్రీ వేంకట నారాయణగారికి, గ్రంథా విష్కరణోత్సవాన్ని జయప్రద మొనర్చిన కవి పండితులకు, సదస్యు లకు హృదయపూర్వక అభివాదములు.

తుది క్షణంవరకు పుస్తకాన్ని స్మరిస్తూ, నాకై ఎదురుచూస్తూ, పరమపదించిన శ్రీ శాస్త్రిగారికి ఈ నివేదన అందజేసి వారికి శాశ్వత శాంతి విశ్రాంతుల లభింపజేయ పరాత్పరుని ప్రార్థింతము. వారి కుటుంబానికి పరమేశ్వరుడు శాంతి సౌభాగ్యముల నొసంగుగాక.

"సహనా వవతు,
సహనౌభునక్తు
సహవీర్యం కరవావహై,
తేజస్వినావధీతమస్తు
మావిద్విషావహై
ఓం, శాంతి, శాంతి, శ్శాంతిః"

చెన్నాప్రగడ హనుమంతరావు,
సంచాలకుడు,
సాహిత్య సంసత్.

జనగామ
15-4-59

# అశ్రుపూజాంజలి

అత్యంత పూజ్యపాదులగు బ్రహ్మశ్రీ నిగమమూర్తులయిన అనుముల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ఆంధ్రదేశములోని బుధజనాళికి సుపరిచితులు. శాస్త్రిగారే 'ఆంధ్ర' సాహిణి యనుట అతిశయోక్తి కాదు. భార్గవచరిత్రాది కావ్యగ్రంథము లనేకము లద్దానికి నిదర్శనములు. కావ్యకర్తలే గాక సవిమర్శకులు. సత్యమును నిగ్గుతేల్చగల చారిత్రక పురుషులు. సర్వశాస్త్ర నిష్ణాతలు. వారి శేముషీవిభవమును కొనియాడనాడు మాటలుచాలవు. ఈ "కుమారరుద్రదేవకవి" యను చారిత్రకగ్రంథమే నిదర్శనము. ఆంధ్రదేశమున కేలుపై సంఖ్యానము చేయదగువారిలో ఒకరు.

ఐనను వారు పేరుకై ప్రాకులాడినవారు కారు. చేయదలచిన సాహిత్యకృషి నిరంతరము చేయుచు విద్యానికేతనములలో ఆచార్యప్రవృత్తి నాచరించి జీవితమును నిరాడంబరముగ వెలిబుచ్చిన సౌమ్యమూర్తి.

వారికి యేలాంటి ఆశలులేవు. ఏ పరిషత్తున గాని ఏ ప్రభుత్వోన్నత వ్యవస్థయందు గాని ఉన్నతపదవిని కోరువారు కారు. ఒకరిని స్వార్థము ఏ స్థితి యందును కొనియాడుట గాని, ఒకరితో కొనియాడించుకొనుట గాని పుట్టుకతో గిట్టనివారు. నమ్మిన చారిత్రక, శాస్త్ర సత్యములను 'ఢంకాకొట్టి' గట్టిగ ఎలుగెత్తిచాటే ధీశాలులు. ఎంతటి ధీశాలులో అంతటి సౌహార్ద్రస్వభావులు. శాస్త్రిగారి విషయమై నిట నింక తెలుపుట అనవసరము.

ఈ గ్రంథమును పూర్తిచేసిరో లేదో శాస్త్రిగారిని సర్వేశ్వరుడు కాలప్రవాహములో విలీనమొనర్చుకొన్నాడు. అది మన దురదృష్టము. వారు వ్రాయదలచిన ప్రధానవిషయము లింకెన్నియోయుండెను.

శాస్త్రిగారు శిష్యవాత్సల్యము పుత్రప్రేమయు నాయెడక్లిష్టమై చూపు కారుణ్యపురుషులు. అవసానదశలో వారిని చూడకపోవుట నా దురదృష్టము. వారిపైనుండు భక్తిపూర్వక ప్రేమయే నన్ను అత్యంత దుఃఖితునిగ నొనర్చినది. ఈ దుఃఖానుభూతి పరిణామాశ్రు ధారయే భక్తిపూర్వకముగ, వినమితనేత్రాలతో సమర్పించు అశ్రు పూజాంజలి.

పరమేశ్వరుడా పవిత్రజీవికి శాశ్వతసుఖ, శాంతుల నొసగి తనతో సదా లీన మొనర్చుకొనుగాక యని ప్రార్థన. ఈ అవకాశమును కోరినంతనే కలిపించిన సాహితీ సంసత్ వారికి నా కృతజ్ఞతాభివందనములు.

జనగామ
10-4-59

భవదీయుడు
చిట్టిమల్లె శంకరయ్య

# కుమారరుద్రదేవకవి

## మొదటి ప్రకరణము

ఈ కవినిగూర్చి చర్చించుటకు ముందు భాస్కర రామాయణ కవులనుగూర్చి చరిత్రకారు లింతవఱకును విచారించుచు వచ్చిన ముఖ్యాంశములను గొంతవఱకు సామాన్యరూపముననైన బేర్కొనవలసియున్నది.

ఏలయన భాస్కరరామాయణమని ప్రఖ్యాతిఁ జెందిన మహాకావ్యములో నయోధ్యాకాండాంతముననున్న గద్యనుబట్టి యది యీకవి యొక్క రచనగా స్పష్టపడుచున్నది. అరణ్యకాండము భాస్కరకవిదని తద్గద్యమువలననే దేలిన విషయము. ఇంతేకాక యుద్ధకాండాంతమునఁ దద్రచయితయగు నయ్యలార్యుఁడు తాను భాస్కరకవి రచియింపఁగా మిగిలిన యా కాండముయొక్క శేషమునుమాత్రమే రచించినట్లు తన గద్యమునందుఁ జెప్పియుండుటనుబట్టి భాస్కరకవి యొక అరణ్యకాండమునేకాక యుద్ధకాండ పూర్వభాగమును గూడ రచించినట్లు తెలియుచున్నది.

ఈ విధముగా భాస్కరుని పేరఁ బ్రఖ్యాతమైన రామాయణములో (౧) అరణ్యకాండము పూర్తిగను (౨) యుద్ధకాండము యొక్క పూర్వభాగమును మాత్రమే భాస్కరకవి యొక్క రచనలనుట స్థిరపడిన విషయము.

తక్కిన భాగములలో (౧) బాలకాండము (౨) కిష్కింధ కాండము (౩) సుందరకాండము అను నీ మూఁడు కాండలును వాని గద్యములనుబట్టి మల్లికార్జునభట్టు రచనలని తేలినది.

యుద్ధకాండాంతము దాని గద్యమువలన నది యయ్యలార్య విరచితమని తెలియుచున్న విషయము నింతకుముందే వివరించియుంటిని.

ఇఁక మనము ప్రత్యేకము విచారింపఁ బూనినది అయోధ్యాకాండ కవియగు కుమార రుద్రదేవుని గూర్చియే కనుక ఆవిషయము నిచ్చటఁ బ్రత్యేకముగా జెప్పవలసిన పనియే యుండదు.

భాస్కర రామాయణరచనను గూర్చిన యొక గాథ

౧. ఒక్క రామాయణము నిందఱు కవులు రచింపఁ బూనుటకుఁ గారణమేమి ?

౨. వీరిలో వీరికిఁగల సంబంధ మెట్టిది ?

అను శంకావిశేషములకు సమాధానముగా నొక గాథ చెప్పబడుచున్నది. దాని నీ క్రింద వివరించుచున్నాను.

పూర్వము గోనవంశమునఁ బుట్టిన బుద్ధభూవిభుఁడను రెడ్డిరాజు రామాయణము నాంధ్రీకరింపఁ జేయవలయునను కుతూహలముతోఁ దన యాస్థాన కవులగు భాస్కరాదులకుఁ దన మనోభీష్టము నెఱిఁగించి వారిలో నెవ్వరు దానిని ముందు పూర్తి చేయుదురో వారి గ్రంథమును దాను కృతిఁ గొందునని తెలియఁ జేసెనట. భాస్కర రంగనాథు లను నిద్దఱు కవు లందుకు

బూనుకొని యొకరికంటె నొకరు ముందుగా రాజునకా కృతి సమర్పింపఁ బ్రయత్నించిరట. రంగనాథుఁడు దన కావ్యమును ద్విపదలో రచింప నారంభించెనని విని భాస్కరుఁడు దన కావ్యమును బుత్ర మిత్ర శిష్య సాహాయ్యమునఁ బద్యరూపముననే ముందు రచింపఁ గడఁగెనట. తత్ఫలితముగా నిరువుర కావ్యములును గొంచె మించుమించు ఏకకాలముననే పూర్తి యగుటయు వారు తమ గ్రంథములతోఁ గూడ నేకకాలముననే రాజును దర్శించి వానిని సమర్పింపఁబోవ నాతఁడు పక్షపాత బుద్ధిచే రంగనాథుని కృతిని గుడిచేతఁ గైకొని భాస్కరుని కృతి కెడమచేయి సాచెనట. అట్టి యవమానమునకు భాస్కరుఁడు కోపించి "నా కృతిని నీ గుఱ్ఱపు కాపరికైన నిత్తును గాని నీకుమాత్ర మీయ"నని ప్రతిన పూని యట వెడలి చని యాఱేని యశ్వపాలకుఁడగు సాహిణి మారనికిఁ దన కావ్యమును గృతి యిచ్చి తన ప్రతిజ్ఞను జెల్లించుకొనియెనట.

ఈ కథలో నేదో కొంత సత్యమున్నట్లే తోచుచున్నది. ఎట్టులనఁగా ఒకానొక కవి యేదో యొక గ్రంథమును రచియింప నారంభించి పూర్తిచేయు లోపల దైవమానుషములలో నేదేని యొక కారణమున నంతరాయము చెందవచ్చును. శేషమును దరువాతి కవు లెవ్వరో పూని పూర్తిచేయవచ్చును. మహాభారతము యొక్కయు, భాగవతము యొక్కయు రచనారీతు లిట్టివై యే యున్నవి. కాని రామాయణ రచన ఈ సాధారణ పద్ధతికి విరుద్ధముగా నున్నది. తత్ప్రారంభకుఁడు మల్లికార్జున భట్టు. అతడైనను వరుసగా నా కావ్యమును గొంతవఱకైన

రచించినవాఁడు కాఁడు. ౧,౪,౫ కాండము లతనివి. ౧-౪ ల నడుమ నున్న కాండములలో ౨ వ దగు అయోధ్యాకాండము రుద్ర దేవునిది. ౩ వ దగు నరణ్యకాండము భాస్కరునిది. మరల ౪-౫ (కిష్కింధా - సుందర) కాండములు మల్లికార్జునభట్టువి. వాని పిమ్మట ౬ వ దగు యుద్ధకాండము మరల భాస్కరునిది. కాని అందుఁ జివరిభాగ మయ్యలార్యుఁ డను మఱియొక కవిది. వట్టుకు నలుగురు కవులచే నా కావ్యము పూర్తిచేయఁ బడినది. ఆ నలుగురిలో కాండసంఖ్యనుబట్టి చూచినను పద్యసంఖ్యనుబట్టి చూచినను మల్లికార్జున భట్టున కాధిక్యము గానవచ్చుచున్నది. ఇట్లు గ్రంథారంభకుఁడును, రచనాబాహుళ్య విశిష్టుఁడునైన మల్లికార్జునుఁడుండ, నడుమవచ్చి దూరినట్లున్న భాస్కరుని పేర నా గ్రంథమంతయుఁ బ్రఖ్యాతిఁ జెందుటలో నేదో యొక రహస్య మున్నట్లే యూహింపవలయుననుట తథ్యము. ఆ పక్షమున భాస్కరుఁడు సపుత్రమిత్ర శిష్యముగా నాకార్యమును బూర్తిచేసినవాఁ డనుటయు నందుల కేదేని యొక కారణ ముండియే తీరుననుటయుఁ ద్రోసివేయవలసిన యంశములు కావు.

అయితే యుద్ధకాండముయొక్క చివరిభాగమును రచించిన కవియగు అయ్యలార్యుఁడు కాండాంతమున వ్రాసికొని యున్న,

చ. అమరహుళిక్కిభాస్కర
మహాకవి చెప్పగనున్న యుద్ధకాం

డము తరువాయిచెప్పెఁ బ్రకట
ప్రతిభాషణుఁ డప్పలార్య స
త్తమసుతుఁ డయ్యలార్యుఁడు
గృతస్థితి నార్యులు మెచ్చునట్లుగా
హిమకర తార భాస్కర
మహీవలయస్థిర లక్ష్మి చేకురన్.

అను పద్యమువలనఁ గాని, తరువాతనున్న,

"ఇది శ్రీ శాకల్య మల్లకవి రవిరాహు నృసింహావరజా ప్పలార్య నందనోభయభాషాకవితావిశారద శారదా చరణకమల పరిచరణ పరిలీఢ మానసాయ్యలార్య విరచితం బయిన శ్రీ రామాయణ మహాకావ్యంబునందు యుద్ధకాండ శేషంబు సర్వంబును నేకాశ్వాసము."

అను నాతని గద్యమువలనఁగాని భాస్కరునకును నీ యయ్యలార్యునకును నెట్టి సంబంధమును నూహించు నవకాశము లేదు. భాస్కరుఁడు యుద్ధకాండ మధ్యభాగమున నేకారణముననో యుపహతిఁ జెందగా నది యెప్పుడో అయ్యలార్యుఁడు పూర్తి చేసినట్లు మాత్రమే యుదాహృతభాగములు మన కెఱింగించుచున్నవి. మఱియు యుద్ధకాండమునందు ౧౧౩౩ పద్యములైన తరువాత ౧౧౩౪ అగు "శ్రీనుత మూర్తియైన రఘుశేఖరు తేజము" అను పద్యమునుండి అయ్యలార్యుఁడు ప్రారంభించినట్లు ప్రాచీనతాళపత్ర ప్రతులలోఁ గల "ఈ ఘట్టమువఱకు హుళక్కి భాస్కరకవి విరచితము. ఇది మొదలు కడవఱకు వేంగిరి నాయనింగారి ప్రేరణమున నయ్యలార్యుఁడు రచియించినది"

అను పూర్వతర లేఖకుల వ్రాతసైతము భాస్కరాయ్యలార్యుల ప్రాగుత్తర కాలీనత్వములను బోధించుచున్నది. హుళక్కి భాస్కరుఁడు శాకల్య మల్లన మొదలుగాఁగల కవులును సాహిణి మారన్న యాదిగాఁగల సేనానులును కాకతీయ ప్రతాపరుద్ర దేవుని యాస్థానమునందున్నట్లు ఓరుగల్లు కొండవీడులందలి దండగవిలల వలనఁ దెలియుచున్నట్లును జరిత్రకారులు వ్రాసి యున్నారు.

## ప్రతాపరుద్రుని రాజ్యాంతకాలము క్రీ. శ. ౧౩౨౩

అయ్యలార్యుని రామాయణ శేషవిరచనమునకుఁ బ్రేర కుఁడుగాఁ జెప్పఁబడిన వేదగిరినాయఁడు రాచకొండ పాల కుఁడును వెలుగోటి సురభివారి చరిత్రముల ప్రకారము తద్వం శమున ౫వ తరమువాఁడుగాఁ జెప్పఁబడు అనపోతానాయని పెద్దకుమారుఁడును, రసార్ణవ సుధాకర కర్తయగు సింగమ నాయని కన్నయునైన వేదగిరినాయఁడే కాని యన్యుఁడు గాఁడు. అతఁడు తనతండ్రి పిమ్మట క్రీ. శ. ౧౩౦౦ ప్రాంతమున రాజ్యమునకు వచ్చి క్రీ. శ. ౧౪౦౦ వఱకును రాజ్యముచేసి యుండవలెను. ఇట్టి యీ రాజుచేఁ బ్రేరితుఁడై రామాయణము పూర్తి చేసిన అయ్యలార్యుఁడును క్రీ. శ. ౧౩౮౦-౧౪౦౦ ప్రాంతమువాడే కావలయును. ఇంతేకాక అయ్యలార్యుఁడు తన గద్యములోఁ దన పెదతండ్రియైన నృసింహాకవినిగూర్చి "శాకల్య మల్ల కవిరవిరాహు" అనఁగా శాకల్య మల్లకవి యను సూర్యునకు రాహువువంటివాఁడు (తద్విజేత) అని సైతము

చెప్పికొని యున్నందునను నుదాహృత (దండకవిల) వచనముల వలన హుళిక్కి భాస్కర శాకల్య మల్లనలు సమకాలికులైన కవులని తెలినందునను భాస్కరాయ్యలార్యుల కాలభేదము స్పష్టమగుచున్నది.

ఇకఁ దక్కినకవులు అనగా మల్లికార్జున భట్ట రుద్రదేవ కవులు భాస్కరుని సమకాలికులనుటకు వారి గ్రంథభాగముతే కొంతవఱకు సాధనము లగుచున్నవి.

౧. భాస్కరుఁడు తన యరణ్యకాండమును రెండాశ్వాసములుగా విభజించి ప్రతి ఆశ్వాసాద్యంతములందును గృతిపతియగు సాహిణిమారన్నను వర్ణించి యున్నాఁడు. ఇట్లే యుద్ధకాండారంభపద్యముగూడ సాహిణి మారని వర్ణనాత్మకముగనే యున్నది.

౨. కుమారరుద్రదేవుఁడును దన యయోధ్యాకాండముయొక్క యాద్యంతములందు సాహిణిమారన్ననే కైకొని కృతిపతి స్థానమున వర్ణించుటయే కాక భాస్కరుఁడు తెలియఁ జేయని కృతిపతియొక్క తలిఁ దండ్రుల పేర్లను సైతము పేర్కొన్నాడు.

క. శ్రీరమణీరమణ సుధా
ధారాళ దయాకటాక్షధామస్మిత దృ
క్కైరవ వితరణకరణ వి
శారద! బుద్ధయకుమార! సాహిణిమారా!

(అయో. కాం. ఆశ్వాసాది)

కనకకుధరధీరా! కాచమాంబా కుమారా.

(అయో. కాం. ఆశ్వాసాంతము)

ఇట్టి కృతిపతి సంబంధ సూచనలవలన నా కవి కతనితోఁ జక్కని పరిచయ మున్నదని సైతము తెలియవచ్చుచున్నది. ఇందువలన రుద్రదేవకవి తప్పక భాస్కరకాలీనుఁడే యనుట కవకాశ మేర్పడినది.

౩ మల్లికార్జునభట్టు తన గ్రంథ భాగములలో సాహిణి మారన్నను బేర్కొని యుండలేదు. అతఁడు తన యాశ్వా సాద్యంత పద్యములను బరమేశ్వర వర్ణనాత్మకములుగా రచించి యున్నాఁడు. అయినను నాతని గద్యమునుబట్టి యతఁడు భాస్కర సత్కవి పుత్రుఁడని స్పష్టపడుచునే యున్నది. ఏక గ్రంథభాగ రచయితలు గావున నరణ్యకాండ, యుద్ధకాండము లను రచించిన హుళక్కి భాస్కరుఁడే మల్లికార్జునుని తండ్రి యనుటయు యుక్తతమమై యున్నది.

ఇట్లు చూడ నే కారణమున నైననేమి భాస్కరుఁడు తన పుత్ర మిత్ర సహాయమును గోరి వారి వారి రచనలకు విషయ విభాగము గావించి తాను దన పాలి యంశమును రచించి యున్నాఁ డనుట నమ్మఁదగిన విషయముగనే యున్న దని నా యభిప్రాయము.

ఇంక మనము ప్రకృతాంశమునకు దిగవచ్చును. అందు మనము ముందుగాఁ జర్చింపఁదగినది రుద్రదేవకవి యయోధ్యా కాండాంత గద్యము.

అది యిప్పటి ముద్రణములో నీక్రిందివిధముగా ముద్రింపఁ బడినది.

"ఇది (౧) సకలకలావిశారద (౨) శారదాముఖ ముకురాయమాణ సారస్వత (౩) భట్టబాణనిశ్శంక (౪) వీర మారయ కుమార (౫) కుమార రుద్రదేవ ప్రణీతంబైన" అని. కాని యీ ముద్రణ విభాగము మాత్రము సరియైనది కాదని నా యభిప్రాయము. 'భట్టబాణనిశ్శంక' అని కూర్చి యేదో అప్రసిద్ధార్థము చెప్పుటకంటె "సారస్వత భట్టబాణ" అని విడఁ దీసి "బాణోచ్ఛిష్టం జగత్సర్వం" అను ప్రసిద్ధికి సరిపోవునట్లు ముద్రించుట యుక్తమైయుండును. అట్లయిన నిశ్శంక శబ్దము నిరాలంబ మగునందు రేమో. నిశ్శంక శబ్దమును వీరశబ్దముతోఁ గూర్చినచో నది "నిశ్శంకవీరమారయకుమార" అనునంత వరకు సాగి వీరమారయ కింటిపేరుగాఁగాని బిరుదనామ ముగాఁగాని యేర్పడి యుచితార్థము నీయఁగలదు. కనుక గద్య ముద్రణ మీ క్రిందివిధముగా నుండుట సమంజసము—

> "ఇది సకలకలావిశారద శారదాముఖముకురాయమాణ సారస్వతభట్టబాణ నిశ్శంకవీరమారయకుమార కుమార రుద్రదేవ ప్రణీతంబైన" అని.

ఇందుఁ గవిపేరు 'కుమారరుద్రదేవుడు' అను విషయము గమ నింపఁదగినది. అది మాత్రము తారుమారుచేయ వీలుగానిది. కనుక సక్రమముగనే ముద్రితమైనది. తత్పూర్వపద మాతని తండ్రిని దెలియఁజేయునది. కనుకఁ గుమార రుద్రదేఁడు నిశ్శంక వీరమారయ్యకుమారుఁడు. అనగా అతని తండ్రి 'నిశ్శంక' యను నింటిపేరు గలవాఁడొండె, తద్బిరుదము గలవాఁడొండెఁ గావలయును. లేదా 'నిశ్శంకవీర' అనునంతవఱకును సాగించి,

ఇదియంతయు మారయ బిరుదమన్న నింకను సమంజసముగనే యుండును. "నిశ్శంక వీరమారయకుమార" అనునది పూర్తి యైనపిమ్మటనే అనఁగా బుత్త్రార్థక కుమారశబ్ద మొకసారి ప్రయుక్తమైన పిమ్మటనే రెండవకుమార శబ్దము రుద్రశబ్దము వెంట జంటింపఁబడి యుండుటచేతఁ గవి నామము కేవల రుద్రదేవుఁడని కాక 'కుమారరుద్రదేవుడు' అను విషయము స్పష్టపడుచున్నది. ఇఁక నీ గద్యములోనున్న యితర విశేషణ ములనుబట్టి కవి విశేషములు తెలిసికొనదగిన వగుట వేఱుగాఁ జెప్పవలసియుండదు. కుమార రుద్రదేవకవి సకల కళావిశార దుఁడు. కళలు ౬౪ అని మన పూర్వుల నిర్ణయము. అవి యన్నియు నెఱింగినవాఁడట యీ కవి. కవికి కళావిశార దత్వము ముఖ్యమైనదే. తిక్కనసోమయాజి తన నిర్వచనోత్తర రామాయణములోఁ 'గళావిదుఁడ'నని ప్రత్యేకముగాఁ జెప్పుకొని యుంట ప్రసిద్ధము—

" శారదాముఖ ముకురాయమాణ సరస్వతీ ముఖ (స్వరూప) మును బ్రదర్శించుటలో నద్దమువంటివాడు. అనఁగా సరస్వతియొక్క ప్రధానస్వరూపము చూడవలెనన్నఁ దనయందే చూడవలెనని కవి చెప్పుకొనుచున్నాఁడన్నమాట—

"సారస్వతభట్టబాణ" ఇట్టి బిరుదము వాఙ్మయ సర్వస్వ వేత్తలను నర్థమునఁ బండితులగువారికిఁ గవు లుపయోగించు చుండెడిదే. దశకుమారచరిత్రములోఁ దిక్కన సోమయాజి యొక్క పాండిత్య ప్రకర్షను దెలుపు సందర్భమున అభినవ దండి కేతనకవి చెప్పిన

కం. "అగునని కొమ్మయ తిక్కఁడు
జగతి నపూర్వార్థమైన చారు కవితమై
నెగడిన బాణోచ్ఛిష్టం
జగత్తనెడు పల్కు నేఁడు సఫలంబయ్యెన్."

అను పద్యములో భట్టబాణకవియొక్క వాఙ్మయ సర్వస్వ సర్వస్వాతంత్ర్యమే సూచింపఁబడినది.

పైన వివరింపఁబడిన "శారదాముఖ ముకురాయమాణ" అను పదప్రయోజనమును ప్రయోగపద్ధతియు నింకొక విశేష మునుగూడ సూచించుచున్నది.

నన్నెచోడవ పోకవి తన గద్యములోఁ గుమారసంభవము నందు "మల్లికార్జునదేవ దివ్యశ్రీ పాద పంకజ భ్రమరాయమాణ" అని చెప్పికొన్నవైఖరి యిందున్నది. అచ్చటి భ్రమరాయమాణ శబ్దమువంటిదే యిచ్చటి యీ ముకురాయమాణ శబ్దము. రుద్ర దేవకవి కిందువలన నన్నెచోడుఁడను ప్రసిద్ధరాజకవి ననుకరించు నుత్సాహము గలదనుటయే యీ విశేషము.

భాస్కరరామాయణ కవుల గద్యములలో అయ్యలార్యుని గద్యము కొంత బింకముగనేయున్నది. అది యింతకుముందొక సందర్భమున నుదాహరించియే యుంటిని, కాని యదియు నీ రుద్రదేవకవిగద్యమువలె నంత యాడంబరమైనదిగాదు. ప్రధానుఁ డైన భాస్కరకవి గద్య మాతని గొప్పదనమునకును బ్రసిద్ధికిని దగినట్లే యతి సంగ్రహముగా గంభీరార్థముగానున్నది. "ఇది సకల సుకవి జనప్రణుత యశస్కర భాస్కర ప్రణీతంబైన" అని తత్స్వ

రూపము. 'ప్రణుత' కు బదులు 'వినుత' యను పాఠముకూడఁ గలదు.

మల్లికార్జునభట్టు ప్రౌఢ యౌవనుఁడుకాఁబోలు. తనయా వయో విశేషమున కనురూపముగా "ఇది శ్రీమదష్టభాషా కవిమిత్ర కులపవిత్ర భాస్కరసత్కవిపుత్ర మల్లికార్జునభట్ట ప్రణీతంబైన" అని తన గద్యమును జెప్పుకొన్నాడు.

ఇందలి గద్యములలో నేదియు రుద్రదేవుని గద్యము వంటి యుదగ్రతగలదిగాదు.

ఇంతయేల అతని పేరే యుదగ్రతరమైనదిగదా! అతఁడు కుమారరుద్రదేవుఁడు.

కుమార భర్తృదారకశబ్దములు యువరాజను నర్థము గలవి.

"యువరాజస్తు కుమారో భర్తృదారకః" అని యమర నిఘంటువు. కనుక నిది యాతని యువరాజత్వమును బ్రకటించు నదిగా నుండవలెను. "మారయ కుమార" అని తత్పూర్వము పుత్రార్థక కుమారశబ్ద మున్నదిగావున నిది తప్పక యువరాజత్వ సూచకమే యనుట గ్రాహ్యము.

ఇక నామాంతమునందున్న దేవశబ్దము సైతము కవి సాధారణమైనదికాదు. "రాజా భట్టారకో దేవః" అనిగదా నిఘంటువు. కుమారశబ్ద పూర్వకమును, దేవశబ్దాంతమునునైన రుద్రనామము. రాజకుల సాధారణమైనదిగాని యన్యముగాదు.

---

# రెండవ ప్రకరణము

భాస్కరాదులు ప్రతాపరుద్రదేవుని కాలమువారైన తదాస్థానకవులనుటకు గొన్ని ప్రాచీన సాధనములు యున్నవి యిదివరకే తెలిపియుంటినిగదా!

అట్టి యా చక్రవర్తికి యువరాజత్వదశలో ననఁగా రుద్రమదేవి రాజ్యకాలములో నతఁడు యువరాజపట్టము పొంది యున్న కాలమున శాసనములందు సరిగా మన కవికున్న పేరే వాడఁబడినది. చూడుడు! ఈ శాసనము నలగొండజిల్లా పానుగంటిలోని ఛాయా సోమేశ్వరుని దేవాలయములో నున్నది. ఇది లక్ష్మణరాయ పరిశోధకమండలివారు క్రీ. శ. ౧౯౩౫ లో బ్రకటించిన తెలంగాణ శాసనముల మొదటి సంపుటములోని కాకతీయ శాసనములలో ౩౫ నంబరు శాసనము. ఇందలి ప్రభు విషయవాక్యము లీ క్రింద నుదహరించుచున్నాను.

"స్వస్తి సమధిగత పంచమహాశబ్ద మహామండలేశ్వర అనుమకొండ పురవరాధీశ్వర చలమర్తిగండ మూరురాయ జగద్దళ నామాది సమస్త ప్రశస్తి సహిత శ్రీ కాకతీయ కుమార రుద్రదేవ మహారాజులు పృథివీ రాజ్యంబు సేయుచుండంగాం దత్పాద పద్మోపజీవి రాయస్థాపనాచార్య నిశ్శంక వీర యశకా (బహుళశః యశస్కకాబోలు) జక్కన నాయంకుల

కొడుకులు ఇంమడి మల్లికార్జున నాయంకులు స్వస్తిశ్రీ శకవర్షం బులు ౧౨౧౩ అవు వికృతి సంవత్సర జ్యేష్ఠ శు. ౭ మంగళ వారము నాండు కుమార రుద్రదేవ మహారాజులకుం బుణ్యా ముగా పానుముగంటిని ఛాయా సోమనాథ దేవరకు అంగరంగ భోగార్థమై ఉదయాదిత్య సముద్రము వెనుకను ఇచ్చిన వృత్తి నీరు, నేల"..........ఇది శా. శ. ౧౨౧౩ జ్యేష్ఠమున వేయఁ బడినది గాన అందుకు సరియైన క్రైస్తవ శతాబ్ద కాలము క్రీ. శ. ౧౨౯౧ జూన్ నెల యగును. అప్పుడు ప్రతాపరుద్రుఁడు యువరాజుగా నుండెననుట కభ్యంతరము లేదు. ఈ శాసనము నాటికి ప్రతాప బిరుదముసైత మతనికి వాడుకలో నుండలేదు.

పైఁ జెప్పఁబడిన తెలంగాణా శాసన సంపుటిలో నే-మటి ౧ సం. ౧౦ నెలలకు స్థాపింపఁబడిన యొక శాసనము నల్లగొండ జిల్లా (ఇప్పుడు వరంగలు జిల్లా) గణపవరములోని విష్ణు దేవాలయమునం దున్నది. అందలి వాక్యములు.

"స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శకవరుషములు ౧౨౧౪ అవు నేంటి నందన సంవత్సర చైత్ర శు. ౧ గు. శ్రీ మన్మహా మండలేశ్వర ప్రతాపకుమార రుద్రదేవ మహారాజులు ప్రిథివి రాజ్యం సేయంగాను శ్రీ మన్మహాప్రధాని గంగిదేవనిం గారి కలుము". ఇత్యాది.

ఇందుకు సరియైనది. క్రీ. శ. ౧౨౯౩ ఏప్రిల్ నెల కనుక పై పానుగంటి శాసనము పిమ్మట నిది ౧ సం. ౧౦ మాసము లకు వేయఁబడినట్లు తెలుచున్నది. ఇందుఁ బ్రభునామమునకుఁ బూర్వోక్త శాసనమునకంటె నధికముగా 'ప్రతాప' బిరుదము

చేర్పఁబడినది. కాని కుమారశబ్ద మింకను జంటింపఁ బడినందున అప్పటికి నతడు యువరాజుగనే యున్నట్లు భావింపవలెను.

పై శాసనము పిమ్మట నత్యంత సన్నిహిత కాలీనములైన శాసనము లెవ్వియు మన శాసన సంపుటిలోఁ బ్రకటితములు గాలేదు. కాని తరువాత వికారి సం॥ భాద్రపద శుద్ధ ౧౫ నాఁడు అనగా పై గణపవరపు శాసనానంతరము ౨ సం ॥ ౫ మాసములకు వర్తక ప్రముఖులచే అలంపూరునందు స్థాపింపఁబడిన యొక శిలాశాసనములో నీ కుమారశబ్దము విడిచివేయఁబడినది. అందు,

> "స్వస్తి శ్రీమతు కాకతీయ ప్రతాపరుద్ర మహారాజులు ఓరుగంటి పట్టంబునఁ సుఖసంకథా వినోదంబులం బృథివీరాజ్యంబు సేయుచుండంగాను"

అను వాక్యములున్నవి. ఇది క్రీ. శ, ౧౩౦౦ సెప్టెంబరునాఁటి శాసనము.

ఇది యంతయుఁ జూడఁగాఁ బ్రతాపరుద్రనామమునఁ బ్రఖ్యాతుఁడైన చివరి కాకతీయచక్రవర్తి యొక్క అసలు పేరు రుద్రుఁడని మాత్రమే యుండుననియు నతని మాతామహి (రుద్రమదేవి) రాజ్యముయొక్క చివరికాలమున నతడు యువ రాజుగాఁ జేయఁబడి (౧౨౯౧ జూన్) కుమార రుద్రదేవుఁడనం బడుచు వచ్చెననియు (౧౨౯౩ ఏప్రిల్) దరువాత ౧ సం॥ ౧౦ మాసములలో నే దిగ్విజయమువంటి రాజయోగ్యకార్యములో నిర్వహించి యతఁడు ప్రతాపకుమారరుద్రదేవుడు అనఁగాఁ బ్రతాపబిరుదాంచిత కుమారరుద్రదేవుఁడు అను పేరు

గాంచెననియు నాతరువాత గొలఁదికాలమునకుఁ బూర్తిగాఁ దానే స్వతంత్రరాజై యువరాజత్వ సూచకమగు నాకుమార శబ్దమును వదలి అలంపూరు శాసనము ప్రకారము ప్రతాపరుద్ర దేవుఁడను ప్రఖ్యాత నామమును వహించెననియు మనము గ్రహింపవలసినవార మగుచున్నాము.

ఇట్టి యీ విచారణమున కంతకును ఫలభూతముగాఁ దేలిన యంశము భాస్కర రామాయణాయోధ్యాకాండ కవియుఁ గాకతీయ చక్రవర్తియైన రుద్రదేవుఁడును సనామ ధేయులును సమకాలీనులును మాత్రమే కాక సమానపదస్థులును గూడ నై యుందురను విషయము. దానినిబట్టి వారిద్దరుగాక యేకపురుషుఁడే యగునాయేమి ? అనునొక యనుమానము. కాకతి ప్రతాపరుద్రుఁడు కవి యనుటకుఁ గూడ నొక చిన్న యాధారమున్నది.

ఆంధ్ర చరిత్రకారులగు (శ్రీ) చిలుకూరు వీరభద్రరావు గారు తమ కాకతీయ చారిత్రభాగములో బద్దెనకవి నీతిముక్తావళిలో నున్నదని యీ క్రిందిపద్యము నుదాహరించియున్నారు. (ఇది శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు సంపాదించిన వ్రాత ప్రతిలోఁ దత్ప్రాచీన లేఖకుఁడు వ్రాసియుంచిన పద్య) మట

చ. పరువడి నాంధ్రభాషఁగల
బద్దెన నీతియు సంస్కృతంబులోఁ
బరగఁ బ్రతాపరుద్ర
నరపాలునిచే రచియింపఁబడ్డ యా

నరవరు నీతిసారము
　　వినం జదువం గడు మంచివంచు జె
చ్చెర గవినీతిపద్ధతులు
　　చేసె వినోదము బాలబోధకున్.

దీనినిబట్టి ప్రతాపరుద్రుఁడు నీతిసారమను గ్రంథమును సంస్కృత భాషలో రచించెనని తెలియవచ్చుచున్నది. కొందఱిందుఁ జెప్పఁబడిన ప్రతాపరుద్రుఁడు కాకతీయులలో గణపతి చక్రవర్తికిఁ బెదతండ్రియైన రుద్రదేవ మహారాజుగానోపునని యూహించిరి. కాని యా రుద్రదేవునికి ప్రతాపబిరుద మెచ్చటను గానరానందున నీ పద్యము ప్రతాపబిరుద ప్రసిద్ధుఁడైన కడపటి రుద్రునకే యన్వయింపఁదగును.

## అభ్యంతరములు

ఈ విధమైన యూహా యింతవఱకు నేచరిత్రకారులకును జనించినదికాదు. కాని యెవ్వరును అయోధ్యాకాండ కవిని గూర్చి చర్చించినదియే లేదు. అతని బిరుదనామముల కర్థ విచారణ చేసినవారును లేరు. వేయేల నాకే యీదృష్టి పూర్వము పడియుండినదిగాదు. ఇంతమాత్రమున సత్య పరిశోధనకు సమయమతిక్రమించినదనరాదుగదా! అయితే ఒక్క సమాచారము మాత్రము మనమిచ్చట విచారించుట కర్తవ్యమగుచున్నది.

అయోధ్యాకాండకవి తాను నిశ్శంక వీరమారయ్య కుమారుఁడనని చెప్పుకొన్నాఁడు. ప్రతాపరుద్రుఁడు స్వయముగాఁగాని యితరులవలనఁగాని యెందైన నట్లు వ్యవహా

రింపఁ బడినాఁడా ? అనునదియే యీ విచారణీయాంశము. నిజములోఁ బ్రతాపరుద్రుని తండ్రిపే రెచ్చటను నే సందర్భము నను నెవ్వరిచేతను పేర్కొనం బడినదను నవకాశము గానరాదు. అతని తల్లిమాత్రము ముమ్మడాంబ యనుటకును నామె రుద్రదేవుని పెద్దకుమార్తె యనుటకును మాత్రమే చక్కని యవకాశము లున్నవి. కనుకఁ బ్రతాపరుద్ర జనకుఁ డవిజ్ఞాతనామధేయుఁడై యున్నాఁడు. ఇందువలన నతఁడు నిశ్శంక వీర మారయ్య యగుననుటకు గాని, కాదనుటకుఁ గాని యెవ్వరికి నెట్టి కారణములు నుండవు. వట్టు కాతని కొక తండ్రియుండి తీరవలసినదే కదా !

ప్రతాపరుద్రుని కేవల కుమారరుద్ర నామమునఁ బ్రకటించిన పానుగంటి శాసనములో శాసన స్థాపకుఁడగు ముమ్మడి మల్లికార్జునుఁడు తన తండ్రిని జెప్పుకొనుటలో నతనిని నిశ్శంక వీర యశకా జక్కనాయంకులని పేర్కొన్నాఁడు. అందలి యశకా అను పదము లేఖక దోషప్రాప్తముగావచ్చును. అట్లయిన నిశ్శంక వీర యశస్క అనునది దాని సరియైన రూపము గావలెను. ఇట్టి జక్కయకున్న యుపనామమే రామాయణకవి యగు రుద్రదేవుని తండ్రికిని గానవచ్చుచున్నది. అది యొకవేళ నాతని యింటి పేరైయె యుండునేని ఆ జక్కయయు నీమారయయు జ్ఞాతులైనఁ గావచ్చును. అందొకఁడు రాజకుటుంబముతో బాంధవ్యము గలవాఁడన్న నందు దోష ముండదు. నిశ్శంకవీర జక్కయ్య కింకొక విశేషము గూడ నా శాసనము వలనఁ బొడకట్టుచున్నది, అది రాయస్థాపనాచార్య అను బిరుద

విశేషము. ఈ చర్చ యిట్లు నిలిపియుంచి రామాయణ కవుల విషయమున సాధారణముగాఁ బొడము మఱికొన్ని సంశయములు దీర్చికొనఁ బ్రయత్నించి చూతము. తన కాండాంత గద్యములలో సమానముగా, "భాస్కర సత్కవి పుత్ర" అని చెప్పుకొన్న మల్లికార్జునభట్టు రామాయణ కవులలోఁ బ్రధానుఁడుగా నెంచఁదగిన సకల సుకవిజన వినుత యశస్కర భాస్కరుని కుమారుఁడే యగునా? అనునది యొకటి.

అట్లే తన అయోధ్యాకాండ గద్యములో "మారయ కుమార" అని చెప్పుకొన్న కుమార రుద్రదేవకవి భాస్కర ప్రోక్త భాగముల కైననేమి తన యయోధ్యాకాండమున కైననేమి కృతిపతిగా స్థిరపడుచున్న సాహిణి మారయ కుమారుఁడే యగునా! అనునది మఱియొకటి. అందు మల్లికార్జునభట్టు తండ్రి రామాయణకవులలోఁ బ్రధానుఁడగు భాస్కరుఁ డనుటలో నున్నంత సౌలభ్యము కుమారరుద్రదేవ కవితండ్రి తద్రామాయణ కృతిపతియగు సాహిణి మారన్న యనుటలోఁ గానరాదు. అందుకు ముఖ్యకారణము రుద్రదేవుఁడు తన తండ్రినిగూర్చి చెప్పుకొన్న నిశ్శంకవీర విశేషణమునకును గృతినాయకుఁడగు మారయ్యనుగూర్చి భాస్కరకవితోపాటు తానును వేర్కొన్న సాహిణి విశేషణమునకును భేదముండుటయే యగును. ఇప్పట్టున సాహిణీశబ్దమునుబట్టి కథకులల్లిన మారన చరిత్రము నిజముగా నెట్టి యర్థముగలదో చర్చించుటయు నప్రస్తుతముగాఁజాలదు.

సాహిణియనఁగా గుఱ్ఱాలకాపరి లేక గుఱ్ఱపు నౌకరు, అను వికృతార్థమును గల్పించుకొని సాహిణి మారన్నను గోన బుద్ధభూపాలుని నౌకరుగాఁ జేసి వెనుక వ్రాయఁబడిన భాస్కర రంగనాథుల యిరుబోటీ కథను గల్పించుకున్నారు మన ఆంధ్ర నిపుణులు. నిజములో సాహిణి యనునది సాదిన్ అను సంస్కృతశబ్దమున కేర్పడిన ప్రాకృతరూప మనవలసి యున్నది.

"ఆశ్వారోహాస్తు సాదినః" అని అమరముః. దీనినిబట్టి సాదీ-అనఁగా గుఱ్ఱపురౌతు అనికాని గుఱ్ఱపుసవారనికాని చెప్పఁబడు చిన్న రాజకీయోద్యోగి - ఈశబ్దముఃని- పూర్వమై నప్పుడు 'నిషాదిన్' అగుచున్నది. అప్పుడు హస్త్యారోహకుఁడు (ఏనుగుసవార్) అని దాని యర్థము. శా. శ. ౧౦౪౦ నాఁటి పటన్‌చెఱువు (మెదకుజిల్లా) శాసనమున మహారాజకృతదాన మునకు మహామంత్రి సామంతులతోపాటు మల్లియన్న గజ తురగ సాహిణి సాక్షిగాఁ జెప్పఁబడియున్నాఁడు.

కడపజిల్లాలోని వల్లూరు సంస్థానమున కధిపతియగు గంగయసాహిణి నెల్లూరి మనుమసిద్ధిరాజున కాశ్రితుఁడయిన ప్రభువుఁగా దిక్కన సోమయాజి తన యుత్తర రామాయణము లోని,

ఉ. రంగ దుదారకీర్తియగు
రక్కెసగంగన బెంజలంబుమై
భంగ మొనర్చి మన్మజన
పాలుఁడు బల్విడి వాచికొన్న రా
జ్యాంగములెల్ల నిచ్చి

తన యాశ్రితవత్సల వృత్తి యేర్పడం
గంగయ సాహిణిం బదము
గై కొనఁబంచెఁ బరాక్రమోద్ధతిన్.

అను పద్యమునఁ దెలియఁజేసియున్నాడు.

ఈ నడుమ వేదము వేంకటరాయశాస్త్రిగారు పండిత త్రయమునుగూర్చి వ్రాసిన (౧౯౫౭ ఆగస్టు ౧౭ ఆదివారము) తమ వ్యాసములోఁ బండిత ప్రకాండుఁడగు శ్రీపతి పండితుఁడు ౬ వ విక్రమాదిత్యుఁడనఁబడు త్రిభువన మల్లవిక్రమాదిత్యుని మహోద్యోగియనియు నాంధ్రదేశమునంతయు జయించి విక్రమాదిత్యుని మెప్పువడసిన అనంతపాల మహామంత్రికి బావగారనియుఁ దరువాత శైవాచార్యుఁడై ప్రసిద్ధిజెందినాడనియు వ్రాయుచు నా శ్రీపతి పండితుని యుద్యోగకాలపు బిరుదావళిని శాసములనుండి యెత్తి చూపియున్నారు.

"సమధిగతపంచమహాశబ్ద మహాప్రచండదండనాయకం అంతఃపురాధ్యక్ష మనెవెర్గడె సాహిణివెగ్గడె వెంకసాహాసిగళధిష్ఠాయకం కరణ కన్నడ సంధివిగ్రహి సేనాధిపతి" ఇత్యాదులు—

ఇందు శ్రీపతి పండితుఁడు సాహిణివెగ్గడ (గుఱ్ఱపుసేనాశాఖాధ్యక్షుఁడైన మంత్రి) యని స్పష్టముగాఁ జెప్పఁబడియున్నాఁడు.

ఈ యుదాహృతాంశములలో నేనినిఁబట్టి చూచినను సాహిణీశబ్దవాచ్యులు గుఱ్ఱపు నౌకర్లుగా భావించు నవకాశము

లేదు. ఈ వచనములన్నియు మన సాహిణి మారన్న కాలమున కించుకపూర్వము ప్రవృత్తములైనవి. రాజని చెప్పఁబడిన యా గోనబుద్ధభూపరునకంటె సాహిణి యని చెప్పఁబడిన యీ మారన్న సర్వవిధముల నధికుఁడని తెలుపఁగల యంశములు పెక్కులు రామాయణాశ్వాసాద్యంతముల వలననే యున్నే యము లగుచున్నవి. వాని నుదాహరించుటకు ముందాతని శత్రుపక్షీయ కవియైన వేములవాడ భీమకవి యాతనిఁ దిట్టి చెప్పిన పద్యము నుదాహరించి దానిని విచారింతము. (ఈ పద్యము అప్పకవీయములో "రామగిరి దుర్గము నాక్రమింపఁ బోయిన సాహిణి మారని వేములవాడ భీమకవి తిట్టి చెప్పిన పద్యముగా నుదాహరింపఁబడినది.)

ఉ॥ చక్కఁదనంపు దీవియగు
సాహిణిమారఁడు మారుకైవడిం
బొక్కిపడంగలాఁడు చల
ముం బలముం గల యాచళుక్యపుం
జొక్క నృపాలుఁ డుగ్రుఁడయి
చూడ్కుల మంటలురాలఁ జూచినన్
మిక్కిలి రాజశేఖరుని
మీదికిఁ బోయిన రిత్తపోవునే.

భీమకవి సాహిణి మారన్నను చక్కఁదనంపు దీవి (సౌందర్యద్వీపము)యని తన్నామమునకుఁ దగినట్లు మారునితోఁ బోల్చినాఁడు. చొక్క నృపాలుని రాజశేఖరుఁడని శివునితోఁ బోల్చినాడు. శివుని పైకిఁ బోయిన మన్మథునివలె చొక్క నృపా

లుని మీదికి మిక్కిలి పోయిన సాహిణి మారుడు కాలి పడఁగలఁ డని శపించినాఁడు. దీనిని బట్టియు సాహిణి మారన్న మన్మ థోపమమూర్తి యనియు రాజులతో డీకొని యుద్ధముచేయు వీరవరుఁడనియు దేలుచున్న దేకాని యతఁ డొక యల్పుఁడైన గుఱ్ఱపు కాపరి యనుట కెట్టి యవకాశము లేదు.

ఇఁక రామాయణ కవు లాతనిని నెట్లు వర్ణించిరో వారి పద్యముల నుదాహరించి చూపుదము. మొదట నీతని (సాహిణి మారని) కుమారుఁడా? ఏమి? అను నూహ కాస్పదుఁ డైన రుద్రదేవుని యయోధ్యాకాండాద్యంత పద్యములే యీ క్రిందఁ జూపఁబడుచున్నవి.

కం. శ్రీరమణీ రమణ సుధా
ధారాశ దయాకటాక్ష ధామస్మితదృ
క్కైరవ! వితరణ కరణ వి
శారద! బుద్ధయకుమార! సాహిణిమారా!

ఉ. రాజకిరీట కీలిత విరాజిత నూతన రత్నరాజి నీ
రాజన మంగళాచరణ రంజిత పాదసరోజ! ఖడ్గధా
రాజయ లభ్యమాన రుచిరద్యుతిమన్మణిశాతకుంభ వి
భ్రాజిత సద్వితీర్ణ! రిపుపార్థివ ఖండన! కీర్తిమండనా!

కం. భూరి భుజార్గళలసదసి
ధారాచలిత ప్రతాప దహన మహో దు
ర్వారశిఖాంతర నిపత
ద్వైరారి కుమారశలభ విక్రమ సులభా!

మాలిని :

వినయగుణవిశాలా! విశ్రుతాచారలోలా!
వినుత శుభచరిత్రా! విద్వదంభోజమిత్రా!
ఘనవిజయధురీణా! కామినీపంచబాణా!
కనకకుధరధీరా! కాచమాంబాకుమారా!

భాస్కరకవి తన యారణ్యకాండముయొక్క యాశ్వాస ద్వయాద్యంతములందు ౮ పద్యములను, యుద్ధకాండాదియందు ౧ పద్యమును మొత్తము ౯ పద్యములను కృతిపతి వర్ణనాత్మకములైనవానిని వ్రాసియున్నాఁడు.

కం. శ్రీహిత నయవిలసిత! వా
ణీహిత మృదువచన! ధారుణీహితగుణ సం
దోహా! త్రివిక్రమ విక్రమ
సాహస! నగధైర్యసార! సాహిణిమారా!

(ప్ర. ఆ. అవి.)

శా. పుణ్యుం, డూర్జిత శౌర్యధైర్యమహిమ
స్ఫూర్తిస్ఫుర ద్వైభవా
గణ్యుం, డార్యజనానురంజిత మహా
కారుణ్యుఁడున్, శ్లాఘ్య సౌ
గుణ్యుం, డన్వయవార్థిచంద్రుఁడు,
రిపుక్షోణీశ్వరస్థాపితా
రణ్యుం, డార్తశరణ్యుఁ, డుజ్జ్వల యశో
రమ్యుండు, సౌమ్యుం డిలన్.

కం. మతి విజిత సురాచార్యుఁడు
చతురత్వ చతుర్ముఖుండు సదమలవృత్తా...
యత పంకజలోచనుడును వేడ....
(యతచిత్తపంకజుం డా. పాఠాంతరము)
శ్రిత వినుతగుణ ప్రథాధురీణుడు పేర్మిన్.
(రక్షణగుణ మహాధురీణుఁడు పేర్మిన్. పాఠాంతరము.)

మాలిని :
వితరణఖని, యుద్యద్వీర్య శౌర్యప్రభావో
న్నతుఁడు, భుజబలాత్యున్మాద విద్విడ్ధరిత్రీ
పతిహరణ సమిద్భ్యాభాగగమ్యుండు, సంభా
విత పరిణతచిత్తోర్వీసురుం డుర్వి నెందున్.

(ప్ర. ఆ. అంత.)

కం. శ్రీరామాకుచయుగళీ
హారిద్రోల్లసితవక్ష హరిచరణసరో
జారాధ్యుఁడు మారయధర
ణీరమణోత్తముఁడు సాహిణీతిలక మిలన్.

(అర. ద్వి. ఆది.)

శా. వైరిక్ష్మాతలనాథ పర్వతమహావజ్రాయుధున్ ఘోర దు
ర్వారాంహః ప్రథితారిదుస్సహతమిస్ర ప్రస్ఫురద్భానుగం
భీరాంభోనిధి ధీరతానిమిష భూభృన్నాథు నత్యంత వి
స్తారోదారగుణప్రసిద్ధ నవరాధాపుత్రు సన్మిత్రునిన్.

కం. లలనా జనవర భద్రుని
బలవద్రణరౌద్ర వీరభద్రుని నుద్య

త్సులభతర గుణోన్నిద్రుని
బలవిలసిత వినుత రామభద్రుని బ్రీతిన్.

*మాలిని :*

విభవజితసురేంద్రున్ విస్ఫురత్కాంతిచంద్రున్
శుభతర వరగాత్రున్ సూరిసంస్తోత్ర పాత్రున్
ప్రభుజననివహోద్యున్ బ్రాజ్ఞవిద్యానవద్యున్
సభయరిపుశరణ్యున్ సంభృతాగణ్యపుణ్యున్.

(౧౮. ద్వి - ౧. అంతము.)

కం. శ్రీకర కరుణారుచిర వి
లోకన లీలావికాసలోల విపశ్చి
ల్లోక వివేకకలా శ్రీ
ఞాకుశలా ! మేరుధీర సాహిణిమారా !

మల్లికార్జునభట్టు తన యాశ్వాసాద్యంతములందు శివ స్తుతి చేసియున్నాడు. కాని యొక సుందరకాండాదియందు మాత్రము సాహిణ మారన్న స్తుతిపద్యము గన్పట్టుచున్నది.

కం. శ్రీరమణీ హృదయేశ్వర
కారుణ్య సుధాంబురాశి కల్లోల భవ
శ్రీరంజిత వరవైభవ
సార యశశ్శ్రీ విహార ! సాహిణిమారా.

ఇంతేగాక యతని కిష్కంధాకాండాంతమున.

శా. లాటీచందనచర్చ, చోళమహిళా లావణ్యసామగ్రి, క
ర్ణాటీగీత కళాసరస్వతి, కళింగాంతఃపురీ మల్లికా

వాటీమంజరి, గౌడవాహానయనా వక్షోజ హారాళియై
పాటింపందగు నీదు కీర్తి రథినీ పాలాగ్రణీ సాహిణీ.

ఇవియన్నియునుగాక భాస్కరుని దొక చాటుపద్యము గూడ లక్షణగ్రంథములం దుదాహృతమైనది. అదియు సాహిణి మారన్నను వర్ణించునదియే.

కం. అప్పు లిడునతఁడు ఘనుఁడా
అప్పు ఁడొసఁగి మరలఁ జెందునాతఁడు రాజా
చెప్పఁగవలె సాహిణి మా
రప్పను దానమున ఘనుఁడు రాజు నటంచున్.

కుమార రుద్రదేవుని యయోధ్యాకాండాద్యంత పద్యముల నుండి సాహిణి మారన్న విశేషములు ముందు గ్రహింతము.

1. వితరణ కరణ విశారద - దానముచేయ నేర్చినవాఁడు.
2. బుద్ధయకుమార - స్పష్టార్థము.
3. రాజకిరీట...పాదసరోజ - రాజ సముదాయముచేతఁ బాదాభివందనము పడయు వాడు.
4. ఖడ్గధారా...సద్వితీర్ణ - తన ఖడ్గబలముచే సంపాదించిన జయలబ్ధ ధనమును దానము చేయువాడు.
5. రిపుపార్థివ ఖండన - శత్రురాజుల సంహరించువాడు
6. భూరిభుజా...వీరారి

కుమార శలభ - తన ప్రతాపాగ్నియందు

బడిన రాజులను మిడుతలవలె
మాడ్చివేయువాడు.

7. విశ్రుతాచారలోలా - సదాచార సంపన్నుఁడు.
8. విద్వదంభోజ మిత్రా - పండిత పోషకుడు.
9. కామినీపంచబాణా - స్త్రీలపాలిటి మన్మథుడు.
10. కాచమాంబా కుమారా - కాచమ్మ కుమారుడు.

(వీనివలన మారన్న మహావీరుఁడను విషయము స్పష్టము.)

భాస్కరుని పద్యములనుండి గ్రహింపఁదగిన ముఖ్యాంశములు

1. త్రివిక్రమ విక్రమసాహస.
2. నగధైర్యసార.
3. రిపుక్షోణీశ్వర స్థాపితారణ్యుఁడు.
4. ఉద్యద్వీర్య శౌర్య ప్రభావోన్నతుడు.
5. భుజబల...సమిద్భూభాగగమ్యుడు.
6. వైరిక్ష్మాతలనాథ...ప్రజాయుధుడు.
7. రణ రౌద్ర వీరభద్రుడు.
8. ప్రభుజన నివహోద్యుఁడు.

ఈ చెప్పఁబడిన విశేషణములవలన సాహిణి మారన్న ఆనాఁటి మహావీరాధివీరులలో నొక్కఁడని విశదమగుచున్నది.

భాస్కరుడు మారన్నను ధరణీ రమణోత్తముఁ డన్నాడు కనుక నతఁడొక సామంత రాజని తెలియవచ్చుచున్నది. అంత కంటె నతని విశేషణములు మహావీరుఁ డనుటకే యెక్కువ తోడ్పడుచున్నవి. మల్లికార్జున భట్టాతని "రథినీపాలాగ్రణి."

సేనాధిపాగ్రేసరుఁ డనుచున్నాడు. ఇంతేకాక పై కవులు మారన్న యొక్క వితరణ విద్యాశీలములను సైతము చాల విశదముగా వర్ణించియున్నాడు.

మారన్న కులమేదో తెలిసికొనుట కిందుఁ దగినంత యవకాశము గనిపించుటలేదు.

రుద్రదేవుడు - విశ్రుతాచారలోలా - అనుటలో నేదో కొంత విశేషము గాన్పించుచున్నది.

ద్వాత్రింశన్మంత్రులను గూర్చిన సీసమాలికను బట్టి మారన్న నియోగి బ్రాహ్మణుఁడని చెప్పవలసియున్నది. అందు ౧౫ వ మంత్రి సాహిణి మారన్న—

"కొనియె భాస్కరునిచేఁ దెనుఁగు రామాయణం

బారూఢి సాహిణి మారమంత్రి"

అనునది మారన్నను గూర్చిన పద్యభాగము.

ఈ సీసమాలికను బ్రకటించుచు చాటుపద్య మణిమంజరీ సంపాదకులు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు—

"ముప్పది మంత్రులను దెలుపు నీ సీసమాలిక కట్టుకతలను బట్టి యొక బట్టుకవిచేఁ గూర్పఁబడినది. ఇందులో బేర్కొనఁబడిన మంత్రుల క్రమము కాలక్రమమునకు ననుకూలింపదు. చరిత్రకారులు దీనిని బరమ ప్రమాణముగ దీసికొనరాదు" అని వ్రాసియున్నారు. కాని, దీనిని బట్టుకవియే వ్రాసినాఁడనుటకు వారు చూపిన ప్రమాణాలు లేవు. ఎవరు వ్రాసినను నిది ప్రమాణముగాదను నవకాశముసైతము కనుపింపదు. ఇందుఁ జెప్పఁబడినది వారి వారి పేర్లును దత్తత్కార్యములును

మాత్రమే. అవి కాదనుటకు హేతువులు లేవు. మఱియు నీ
౩౨ గురిలో (౧౫) సాహిణి మారన్న

౨౩ వ మంత్రి– "నీడ ద్రొక్కెడు వేళ నెరినర్థి కభిమతం
బిప్పించెఁ జేమకూరప్పరాజు"

అను పాదమునఁ జెప్పబడిన *చేమకూరప్పరాజు*

౨౯ "వాకిటి కావలి జోకతో నొనరించి
దివ్యకీర్తి వహించెఁ "దిమ్మమంత్రి"

అని చెప్పఁబడి (౩) *వాకిటి కావలి తిమ్మయ*

అను నీ ముగ్గురి కులమును గూర్చి కొంత సంశయమున్నది గాని అంతమాత్రమున వీరు బ్రాహ్మణేతరులే అని బల్లగ్రుద్ది చెప్పుట కవకాశములు లేవు.

సాహిణి మారన్నను గూర్చి ప్రభాకర శాస్త్రిగారు ప్రత్యేకముగా నొక వాక్యముగూడ వ్రాసియున్నారు.

"ముప్పదియిద్దరు మంత్రుల సీసమాలిక యా సాహిణి మారుని నియోగిని చేసినది. ఈతఁడు బ్రాహ్మణుఁడుగాఁ దోపఁడు" అని వారి యావ్రాత. ఇట్లనుటకు బుద్ధరాజ భాస్కరుల వివాదకథ తప్ప మఱి యేయాధారమును లేదు. అదిమాత్రము కట్టుకథ కాదా? ఒకవేళ నది నిజమైనను మారన్న నియోగి బ్రాహ్మణత్వమున కాటంకము లేదు.

ప్రభాకర శాస్త్రిగారు మారన్నను గూర్చి యుదాహరించిన చాటువులు—

కం. అప్పు లిడునతఁడు ఘనుఁడా
అప్పు డొసఁగి మరలఁ గాంచునాతఁడు రాజా

చెప్పఁగవలె సాహిణి మా
రప్పను దానమున ఘనుఁడు రాజు నటంచున్

కం. మాటాడరాదు సభలన్
మాటాడినఁ దప్పరాదు మగసింగముకున్
మాటే మానము గాదా
సాటువ గలవారికెల్ల సాహిణి మారా!

కం. ఇంతుల మనముల నరి సా
మంతుల మనములను బుద్ధిమంతుల మదిలో
జింతింపని బ్రదుకేఁటికి
సంతత సత్కీర్తిహార సాహిణి మారా!

పై మూఁడింటిలో మొదటిపద్యము హుళిక్కి భాస్కరుని చాటువుగా లక్షణశాస్త్రములం దుదాహరింపఁబడినది. తక్కిన రెండు పద్యములు నెవ్వరివో యెందుకుఁ జెప్పఁబడినవో తెలియదు. కాని "సంతత సత్కీర్తిహార" అను విశేషణము మారన్నకీర్తి ప్రియత్వమును వెల్లడించుచున్నది.

శాస్త్రిగారు మారన్న విషయముగా నీ క్రింది శ్లోకమును గూడ నుదాహరించినారు.

శ్లో. అజాగళస్థ స్తన ముష్టిపృష్ఠం
నాసాంతరే కేశ మథాండ యుగ్మం
వృథా సృజత్సాహిణి మారభూపం
పూజాం నలేభే భువి పద్మయోనిః.

నేను చిరకాలమునాఁడే విని నిత్యోపస్థితముగా నుంచి కొన్న శ్లోక మిట్లు లేదు. అందు ౩వ, ౪వ పాదములు.

వృథా సృజత్సాయణ మాయణౌచ
పూజా న దేయా భువి పద్మయోనేః.

అని మాత్రమే. "సాహిణిమారభూపం" అను నీపాద మెక్కడిదో వారి కెందుదొరకినదో చెప్పఁజాలము. సాయణ మాయణలను రాజసోదరులు చిరకాలము పురాణము చెప్పించి యా పౌరాణికునిరిక్తహస్తములఁ బంపివేయుచు, అయ్యా! బ్రహ్మదేవుని కెందుకుఁ బూజ లేదని అడుగగా విసుగుఁజెందిన యా పౌరాణికుఁడు వారి కీ శ్లోకము చెప్పినట్లు నా విన్నకథ, ఆ పాఠమే నాకు యుక్తముగాఁ దోఁచుచున్నది. సాహిణి మారన్న మహాదాతగా వర్ణింపఁబడుట నిదివఱకే రామాయణకవుల వర్ణనముల వలనఁ బాఠకులు దెలిసికొని యున్నారు. కావున నుక్త శ్లోకమునకు శాస్త్రిగారి పాఠము తప్పుపాఠ మగును, అది వారి కెట్లు చెవిని బడినదో తెలియదు.

---

## మూఁడవ ప్రకరణము

రామాయణకవులలో బ్రధానుఁడైన భాస్కరకవి తన గద్యమునందు "సకల సుకవిజనవినుత యశస్కర భాస్కర" అని మాత్రమే వ్రాసుకొని యున్నను అతఁడు వ్రాయఁగా మిగిలిన యుద్ధకాండమును బూరించినట్టియు, నాతనికి సన్నిహిత కాలీనుఁడైనట్టియు అయ్యలార్యుఁడు, "అమరహుళిక్కి

భాస్కరమహాకవి చెప్పఁగ నున్న యుద్ధకాండము తరువాయి చెప్పె" అని తన రచననుగూర్చి చెప్పుకొన్నందున హుళక్కి యనునది యాయన యింటిపేరో బిరుదనామమో అయి యుండునని తలంచితిమి. తరువాత నచిరకాలముననే రచింపఁ బడిన క్రీడాభిరామములోఁ దత్కవి,

ఉ. నన్నయభట్టు తిక్కకవి నాయకులన్న హుళక్కిభాస్కరుం
డన్నను జిమ్మపూఁడి యమరాధిపు డన్నను సత్కవీశ్వరుల్
వెన్నుదుటం గరాంజలులు నింతురు జే యని."

అని భాస్కరుని హుళక్కి భాస్కరుఁ డన్నాఁడు. ఇట్లు యుద్ధ కాండకవియైన భాస్కరుఁడు హుళక్కి భాస్కరుఁడని స్పష పడినది గనుకను-యుద్ధ కాండము వలెనే అరణ్యకాండము గూడ సాహిణి మారన్నకే యంకితము గావునను హుళక్కి భాస్కర కవి తన దశరూపకములను గ్రంథమును గూడ సాహిణి మారన్నకే కృతి యిచ్చినందునను ఆ రెండు కాండములును హుళక్కిభాస్కరునిచే రచింపఁబడినవే కాని యన్యములు కావు. బాల కిష్కింధా సుందర కాండముల రచించిన మల్లికార్జునభట్టు భాస్కరకవికిఁ బుత్రుఁడే యనుటయు న్యాయ్యమై యున్నది. ఇఁకఁ గుమారు రుద్రదేవుని విషయమే ఆలోచింపవలసి యున్నది. రుద్రదేవుఁడు భాస్కరుని శిష్యుఁ డనుట కేయవకాశ మును లేదు. కాని భాస్కరుని వలెనే తానును దన రచనా భాగమును సాహిణిమారన్నకే యంకిత మిచ్చుటవలన నొకవేళ నతఁడు భాస్కర శిష్యుఁడైనను గావచ్చును. ఇంతేకాక తన గద్యములో నాతఁడు "నిశ్శంకవీరమారయకుమార" అని

తన తండ్రిపేరు చెప్పుకొన్నందునను నిశ్శంకవీర శబ్దము మార యకు బిరుద నామముగా నెంచఁదగిన దైనందునను, రుద్రదేవ కవితండ్రి మారయ్యమాత్రమే అనవలసి యుండును. ఆ మారయ్య సాహిణి మారయ్యయే యగునా? మఱి యొకఁడా? అను నీశంకకు సమాధాన మరయవలసియున్నది.

సాహిణి మారయ్య యొక్క జీవితకాలమును నిర్ణయించు దృఢసాధన మొకే యొకటి చరిత్ర పద్ధతిలోఁ గానవచ్చుచున్నది. ఆతని స్థానము సైతము దానివలననే తెలిసికొనవలసి యుండును.

కీ. శే. శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు తమ యాంధ్రుల చరిత్ర రెండవ భాగములో నీ విషయమున కొక మంచి యాధారమును జూపియున్నారు. అది వారి మాటలనుండియే యీ క్రింద వివరించెదను. "క్రీస్తుశకము ౧౩౧౧ సంవత్సరమున గురిజాల పింగళి స్థలములు జేరియున్న పలనాఁటిసీమ కధికారిగా నియమింపఁబడిన మాచయ సాహిణి ప్రతాపరుద్రుని గజసాహిణియైన గుండయ నాయనింగారికిని మారయ సాహిణి గారికిని బుణ్యము కొఱకు దాన శాసనము వ్రాయించి యుండెను. కనుక భాస్కర రామాయణము సాహిణి మారని కంకితము చేయబడుటచేతను దశగతులను దెనిగించిన భాస్కర మహాకవి తదాస్థానకవియగుటచేతను అంతకుఁ బూర్వము రంగనాథ రామాయణమును దరువాత నెఱ్ఱాప్రెగడ రామాయణమును నుండుటచేతను ఈ రామాయణమును భాస్కర రామాయణమని యిటీవలివారు వ్యవహరించుచున్నారు."

రావుగారి పై వాక్యములవలన భాస్కర సాహిణీ మారనల సమకాలీనత్వము ఖండితముగాఁ బ్రకటితమగుటే కాక వారిద్దరును కాకతి ప్రతాపరుద్ర చక్రవర్తి రాజ్యకాలములోని వారే యను ముఖ్యవిషయముగూడ స్పష్టపడిపోయినది. పలనాటి సీమలోని మాచయ సాహిణి యొక్క క్రీ.శ. ౧౩౧౧ వ సంవత్సరపు శాసనమునుగూర్చి క్రింది నోటులో **Annual Report on Epigraphy for 1910 Para 48** అని గుర్తు చూపి యున్నారు. (ఆం. చ - ౧౩ వ ప్రకరణము ౩౩౫వ పేజీ)

ఇందు వలన సాహిణులుగాఁ జెప్పదగిన ముగ్గురి పేర్లీ శాసనమువలనఁ దెలిసినవి. ఈ యిందఱును బ్రతాపరుద్రుని యుద్యోగులేయనుట మిక్కిలి ముఖ్యమైన విషయమైయున్నది. ఈ ముగ్గురిలోఁ గడపటివాడైన మాచయ సాహిణి క్రీ. శ. ౧౩౧౧ నాటివాఁడు గనుక తక్కిన యిద్దరును దత్పూర్వులనుట స్పష్టము.

ఇదే ప్రకరణమునందే ౩౩౯ వ పేజీలో వారు కడప జిల్లాలోని వల్లూరు, గండికోట సీమలఁ బాలించు త్రిపురాంతకాంబదేవులు తిరుగుబాటు చేయఁగా వారిని శిక్షించుటకై ప్రతాపరుద్రుఁడు *గజసాహిగుండయ* నాయనింగారిని గజసాహిణి మాచయనాయనింగారిని బంపినట్లును వారాకార్యము నిర్వహించి "స్వామిద్రోహరగండ, స్వామివాచకరగండ, *ఇమ్మడి నిశ్శంకవీర*, పరమ మాహేశ్వరసమయచక్రవర్తి కలియుగ వీరభద్ర, కీర్తిసముద్ర, జమలిక భోగలింగ, మొదలగు

రాజదత్త బిరుదములఁ బొందినట్లును వ్రాసియున్నారు. మాచయ గుండయలు గజతురగ సాహిణులగుటయే కాక రామాయణాయోధ్యకాండములోఁ దత్కవి తనతండ్రికి వాడిన నిశ్శంకవీర బిరుదముగూడ బొందినవారై దాని మహత్త్వమును వెల్లడించుచున్నారు. అయితే వారు పొందినది ఇమ్మడి నిశ్శంక వీర బిరుదమనుటలో విశేషమేమో తెలియదు.

ఈ గుండయ మాచయలలో మొదటివాడు పలనాటి శాసనములో స్మరింపఁబడినవాఁడును రెండవయతఁడా శాసన స్థాపకుడునై యున్న విషయమును మనము జ్ఞప్తియందుంచు కొనవలెను. ప్రతాపరుద్రుఁడు త్రిపురాంతకాంబదేవుల జయించిన తరువాత వారి గండికోటసీమకుఁ దన సకలసేనాధిపతి మహారాయపట్ట సాహిణి సోమయనాయనింగారిని బరిపాలకునిగా నియమించినట్లు వారి యుద్యోగులగు నాగరాజు అయ్యపరాజు కొడుకులు బయ్యన, చిన్నయ అనువారు శా. శ. ౧౨౩౧ (క్రీ. శ. ౧౩౦౯) సౌమ్య సం॥ ఫాల్గుణశుద్ధ ౭ గురువారము నాఁడు తలకంటిదేవి అఖండ దీపారాధనకుఁ గొంత శుల్క భాగము దానముచేసి యా గుడియొద్ద వేయించిన శాసనము వలనఁ దెలియుచున్నదనియు నందు వ్రాయఁబడియున్నది. ఇంతేకాక యిచ్చట త్రిపురాంతకాంబదేవుల శాసనములు క్రీ. శ. ౧౩౦౪ వఱకు మాత్రమే యున్నందునను పైఁజెప్పఁబడిన తలకంటి దేవాలయ శాసనము క్రీ. ౧౩౦౯ నాటిదై నందునను, ప్రతాపరుద్రుని యీ దక్షిణ దిగ్విజయము ౧౩౦౪ మొదలు ౧౩౦౯ లోపల నెప్పుడో జరిగియుండుననికూడ వారు నిర్ణయించి

నందున నిది పలనాటి మాచయ సాహిణి శాసనకాలమునకంటెం బూర్వవిషయమని కూడఁ దెలియుచున్నది. రావుగారు గంగయ సాహిణిం గూర్చియుఁ బెక్కెడలఁ గొంత వ్రాసియున్నారు. కాని పరికించి చూడఁగాఁ వారీ విషయమున గొప్ప భ్రాంతిలోఁ బడిరని చెప్పవలసినందుకుఁ జింతించుచున్నాను. ఎట్టులన, తిక్కన సోమయాజి విరచితమైన నిర్వచనోత్తరరామాయణము నందలి పీఠికలోఁ గృతిపతి వర్ణనాత్మకమైన దొకపద్యమున్నది. దాని నింతకుముం దొక సందర్భమున నేనుదాహరించి యున్నాను. అది,

ఉ. రంగ దుదారకీర్తి యగు రక్కెస గంగని బెంజలంబు మై
భంగ మొనర్చి మన్మజనపాలుఁడు బల్విడి నాచికొన్న రా
జ్యాంగము లెల్ల నిచ్చి తనయాశ్రిత వత్సలవృత్తి యేర్పడన్
గంగయ సాహిణింబదము గైకొనఁబంచెఁ బరాక్రమోన్నతిన్

అను పద్యము. దీనికి రావుగారు వ్రాసిన భావము వారి యీ క్రింది శంకాసమాధానములవలన విశదమగుచున్నది. "గంగయ సాహిణికిని మనుమసిద్ధి రాజునకును వైరము గలదని తిక్కన సోమయాజి విరచితమైన నిర్వచనోత్తర రామాయణములో" అను పూర్వ పీఠికతో ఆ పద్యమును వ్రాసి...అను పద్యమువలన బోధపడుచున్నది. అని యీ పిమ్మట నీ క్రింది విధముగా శంకించినారు.

"ఇట్టి మహాపరాక్రమవంతుఁడైన గంగయ సాహిణి నొక మండలాధిపతిగ నున్న మనుమసిద్ధి యెట్లు జయించి యతని రాజ్యాంగముల నెల్ల నాచికొనియెనో, ఎట్లాతఁ

డాశ్రితుఁడై యితనిం బ్రార్థించెనో, ఎట్లాతఁ డాశ్రితవత్సలవృత్తి యేర్పడునట్లుగా నాచికొన్న రాజ్యాంగము లెల్లనిచ్చి పదము గైకొనఁ బంచెనో బోధపడకున్నది.” ఇది వారి శంకాగ్రంథము.

“ఇటీవల స్థానిక చరిత్రములం బరిశోధింపఁగా గంగయ సాహిణియొక్క పూర్వ వృత్తాంతము గొంతవఱకుఁ దెలియ వచ్చినది. గంగయసాహిణి మొట్టమొదట గణపతిదేవ చక్రవర్తి కొలువులో లేడనియు మనుమసిద్ధిరాజు తండ్రియైన తిరుకాళ చోడ రాజునకు (తిక్కరాజుకు) అగ్ర సేనాధిపతిగ నుండె ననియు సిద్ధవటము సీమలోని యోగూరు స్థానికచరిత్రము నందుఁ జెప్పఁబడుచున్నది. ఇతఁడు మొదట తిక్క భూపాలు నకు సేనాధిపతిగనుండి యతని యనంతరమున కలువడ పురా ధీశ్వరుండయిన శ్రీమన్మహా మండలేశ్వర త్రైలోక్యమల్ల భుజబల వీరనారాయణరాయదేవ మహారాయల సైన్యాధీశుఁడై మోదు కూరునందుండి ములికినాటిఁని బరిపాలనము సేయునపుఁడు తిక్కరాజుకొడుకైన మనుమసిద్ధిరాజునకును గంగయసాహిణికిని యుద్ధము జరిగి యుండవచ్చును. ఆ యుద్ధమునందు గంగయ సాహిణి నోడించి యతఁడాశ్రయించుటచేఁ దన యాశ్రితవత్సల వృత్తి యేర్పడునట్లుగా యథాస్థానమునకుం బంచెనని స్పష్టమగు చున్నది.” అని తత్సమాధానగ్రంథము. ఉత్తరరామాయణస్థ పద్యమునకుఁ దప్పర్థము చేసికొనుటచే నేర్పడినదే యీ శంకా సమాధానగ్రంథమంతయును. పద్యములో “కర్ణంగ” దుదార కీర్తియగు శ్లోకస్వసగర్భగుణు వెలజల్లరుమై ఖంగమొనర్చి పాని నుర్లిడి మన్మసిద్ధి జనిపోటు సేద రాజ్యాంగములన్న లాగుకొనెనో

ఆ రాజ్యాంగములనెల్ల నతడు దన యాశ్రితవాత్సల్యము తేట పడ గంగయ సాహిణి కొసంగి తత్పదమును గైకొనఁ బంపె నను నర్థము మాత్రమే యున్నది.

కనుక, రంగదుదారకీర్తియగు రాజు రక్కెసగంగఁడు. అతఁడు మనుమసిద్ధికి గొప్ప విరోధి.

మనుమసిద్ధి కాశ్రితుఁడై తదనుగ్రహము పొందినవాడు గంగయసాహిణి — కనుక రక్కెసగంగు వేఱు. గంగయ సాహిణి వేఱు. వీరభద్రరావుగారి శంకా సమాధానములు చదివినచో నీ పరపక్షస్వపక్ష గంగయల నిద్దరిని నొకనిగనే వారు భావించినట్లు తెలుచున్నది. ఇట్టి యీ భ్రాంతిని బురస్కరించు కొనియే వారి తరువాతి చర్చ యంతయును నడిచినది. వారు తమ గ్రంథములో (౧) జన్నిగదేవసాహిణి (గంగయసాహిణి మేనల్లుడట) (౨) త్రిపురాంతకదేవ మహారాజు (౩) అంబయ దేవ మహారాజు—అను వారిని బేర్కొని వీరందఱిని సాహిణులు గను కాకతీయ సేనానులుగను వర్ణించియున్నారు. కాని నిజ ములో రక్కెసగంగును నతని బంధువులు మాత్రమే కాకతి రాజపక్షీయులు — మనుమసిద్ధి యాశ్రితుఁడైన గంగయసాహి ణియు నతని బంధువులును బూర్తిగాఁ గాకతిరాజ విరోధులే. ఈనిర్ణయమునకు సాధనమైనది కడపజిల్లా తాళ్ల ప్రొద్దుటూరిలో నున్న యొక శాసనము. ఈ శాసనమును గొంతకాలము క్రిందట (శ్రీ) నేలటూరి వెంకటరమణయ్యగారును ముట్లూరి వెంకటరామయ్యగారును దమ విమర్శనముతోఁ గూడఁ బ్రకటించి యున్నారు. దాని ముఖ్యాంశములను నేను నా నోటుబుక్కులో

వ్రాసికొన్నాను. అందుండి ప్రకృతాంశమునకుఁ దగినంత విషయము నిప్పుడు గైకొని చర్చించెదను.

శాసన స్థాపకుఁడు జగతాపు గంగదేవుఁడు. శాసన కాలము—స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షం బులు ౧౨౪౪ అగు నాఁటి దుందుభి సంవత్సర మాఘశుద్ధ ౧ శని వారము. (క్రీ. శ. ౧౩౨౩-౨౪ ఫిబ్రవరి)

(ఇతఁడు ప్రతాపరుద్రుని సేనానియై యుండునని అందు దెలుపఁ బడినది) ఇతనికి "విరోధి మండలిక కాలదండ-చల మర్తిగండ" అను బిరుదము లీ శాసనమునఁ జెప్పఁబడినవి. చలమర్తిగండ బిరుదము కాకతీయులకుఁ బ్రసిద్ధము—ఇతని ప్రపితామహుఁడు మధురాంతక చోడదేవుడు. ఇతని పితా మహుఁడు జగతాపుదండి దేవచోళ మహారాజు. ఇతని తండ్రి పేరు అల్లు గంగరాజు. తల్లిపేరు గంగామహాదేవి. ఈ గంగా మహాదేవి రక్కెసగంగు కూతురు. కనుక నీ శాసన స్థాపకుఁ డైన జగతాపు గంగరాజు రక్కెస గంగనికి దౌహిత్రుఁడని స్పష్టముగ తేలినది. ఇతనికి "గండపెండార గంగయసాహిణీ సర్వస్వ బందికాఱ, మామనంకకాఱ" అను బిరుదము లున్నం దున గంగయసాహిణి కీతఁడు ప్రత్యక్ష విరోధియో, విరోధి బంధు ముఖ్యుఁడో కావలెనని తెలియుచున్నది. ఒకవేళ గంగయ సాహిణీ సర్వస్వబందికాఱ బిరుద మీతని కీతని మాతామహుఁ డైన రక్కెసగంగు మూలమున వచ్చినదైనఁ గావచ్చును.

ఇతఁడు రక్కెసిగంగు దౌహిత్రుఁడని యా శాసన శోధ కులే తమ వ్యాసమున స్పష్టపఱిచియున్నారు.

ఇతని పాలిత దేశము ఏఱువతొండ మండలము. ఇది యిప్పటి నెల్లూరుజిల్లా పొదిలి దర్శి డివిజనులలో గొంత భాగమును, కడపజిల్లా బద్వేలు సిద్ధవటము తాలూకాలలో గొంత భాగమును కర్నూలుజిల్లా మార్కాపురము తాలూకా యంతయు నగును. కాకతి గణపతి చక్రవర్తి యీ ప్రదేశమంతయు జయించినట్లు తత్సామంతుఁడైన రేచర్ల రుద్రుని మంత్రియగు రాజనాయకుని క్రీ. శ. ౧౨౩౬ నాఁటి యుప్పలపల్లె శాసనమునఁ బేర్కొనఁబడిన దన్నారు పరిశోధకులు.

ప్రతాపరుద్రునికిఁ దిరుగుబాటు కావించిన అంబదేవుఁడు గంగయ సాహిణికి (క్రీ. శ. ౧౨౩౮-౧౨౭౨) తమ్ముఁడనియు నితనికాలము క్రీ. శ. ౧౨౭౨-౧౩౦౦ ప్రాంతమనియు నాశోధకులే నిర్ణయించినారు.

శాసన స్థాపకుని మాతామహుఁడగు రక్కెసగంగు కలువడ పురాధీశ్వరు డగు రాయదేవ మహారాజు సామంతుడనియు, నతని పాలిత దేశము సిద్ధవట ప్రాంతమనియు, వీని జ్యోతి గ్రామశాసనము క్రీ.శ. ౧౨౪౭ నాటిదనియు నాశోధకలే నిశ్చయించినారు. అట్లే గంగయ సాహిణి కడప సమీపమున నున్న వల్లూరు పట్టణపు రాజనియు, నతఁడు కాయస్థ కులజుఁడనియునుగూడ వారి నిర్ణయము.

అంబదేవునిగూర్చి యాశాసన ప్రకాశకు లీ క్రింది వాక్యములు ప్రత్యేకముగా వ్రాసియున్నారు. "అంబదేవుఁడు గండికోట మనోరథ పురాధీశ్వరుఁడు. ఇతని త్రిపురాంతక శాసనకాలము క్రీ.శ. ౧౨౯౦. అందంబదేవుఁడు అల్లుగంగరాజును

పెక్కండ్రు దండనాయకులతోసహా ఓడించినట్లు చెప్పఁబడినది. మఱియు దేవగిరి ప్రభువగు సేవణరాజుచే అనర్ఘభూషణములు వడసినట్లును అందు గలదట.

ఈ శాసన స్థాపకుఁడగు జగతాపుగంగనికి "సేవణ సేనా దుగ్ధాంభోనిధాన పరిమథన లబ్ధలక్ష్మ్యా దక్షిణ భుజమందరవిలాస విభవ" అనియున్న బిరుదమునుబట్టియు నితఁడు కాకతీయ పక్షీయుడను సంగతి దృఢపడుచున్నది.

సేవణరాజ్యసమాప్తి క్రీ. శ. ౧౩౧౨ లో నైనదికావున వీని సేవణ విజయకాల మాలోపలిదై యుండుననియు శాసన శోధకుల నిర్ణయము.

ఈ యన్నింటివలన గంగయసాహిణిగాని వాని బంధువులు గాని కాకతీయులకు మిత్రకోటిలోనివారు కారనియు, వారి ప్రతిపక్షులగు రక్కెసగంగును వాని యల్లుండగు అల్లుగంగును దత్పుత్రుడగు నీ జగతాపు గంగరాజును మాత్రమే కాకతీయుల మిత్రకోటిలోనివారనియు స్పష్టమైనది.

జగతాపుగంగడు కాకతీయ పక్షమువాఁడనుట కింకొక తార్కాణముగూడ నీ శాసమునఁ గలదు. అతఁడీశాసనమును దాను జంపిన యొక శత్రువును గూర్చి ప్రకటించుకొనుటకే వేయించినట్లిందలి యీ క్రింది,

సీ॥ గీ॥ ఢక్కపిశాచవధూటి దానుత్సహించె

రాయ జగతాపుగంగ భటారమణుఁ డాజి

నమరఁ బెండిలికొడుకు మల్లావనీశుఁ
జెలఁగి సురకాంతతోఁ బెండ్లి సేయునపుడు.

అను సీసగీతమువలనఁ దెలియుచున్నది. ఇందుఁ జెప్పఁబడిన మల్లావనీశుని ప్రతాపరుద్రదేవ పుత్రుఁడైన బుట్టయలంక గొంకారెడ్డి చంపినట్టు లారాజపుత్రుని ములికినాటి శాసనములోఁ జెప్పఁబడినది. అంచెన్నూరిలోనున్న శాసనము :

"స్వస్తి శకవర్షంబులు ౧౨౩౬ (క్రీ. శ. ౧౩౧౩) అగునేఁటి ప్రమాదీచసంవత్సర శ్రావణశుద్ధ ౧౨ బుధవారమునాఁడు స్వస్తిశ్రీమన్మహామండలేశ్వర కాకతీయ ప్రతాపరుద్రదేవ మహారాజకుమారుఁడు మూర్లోక గండమూర్తి ముకుంద కుంతతీర్ణ ప్రతిజ్ఞ పరశు బిరుదాంక రుద్రబిరుద బ్రహ్మారాతుస గండికోటదుర్గ విభాళ మల్లదేవర గొండుగండ స్వయంభూ నాథ దేవ దివ్యశ్రీ పాదపద్మారాధక మహారాయ కంఠకాలనాయకుండైన బుట్టయలంకగారు" అని అందలి వక్కాణము— ఈ వక్కాణములో మల్లదేవర గొండుగండ అనియున్న కన్నడ బిరుదమునకు మల్లదేవుని జంపినవాఁడని యర్థము. ఏ మల్లదేవుని దాను జంపినట్లు జగత్తాపు గంగరాజు తన తాళ్ళప్రొద్దుటూరి శాసనములోఁ జెప్పుకొనియెనో ఆ మల్లదేవునే తాను జంపినట్లు పై రాజపుత్రుఁడు తన బిరుదావళిలోఁ జెప్పుకొన్నాఁడు. తమ సేనాధిపతులు స్వహస్తమునఁ జేసిన వీరకార్యములను దత్ప్రభువులు స్వకృతములుగాఁ జెప్పుకొనుట పూర్వమున్న య్యాచారమే కావున నెవరుచంపిరను ప్రశ్నగాని, చంపఁబడిన వారు వేర్వేరు పురుషులేమోయనుప్రశ్నగాని యునకకక్కర

లేదు. జుట్టయలంకగొంకయ శాసనము జగతాపు గంగయ శాసనముకంటె ౧౦ సం॥ ముందుఁబుట్టినదే. కనుక కాలభేదమును లేదు. దేశభేదము మొదలేలేదు.

అంబయదేవుని దఱిమివేసిన పిమ్మటనో అదేకాలముననో తదీయుఁడైన యీ మల్లదేవుని జగతాపు గంగయ కాకతీయ పక్షమున యుద్ధములోఁ జంపియుండును. ఇట్లు కాకతీయ సామంతులతోడి యుద్ధమున నీ మల్లదేవుడు చనిపోగా నాతని భార్య సహగమనము చేసినట్లు పై జగతాపి శాసనములో మఱియొక పద్యమునఁ జెప్పఁబడినది. చూడుఁడు-

చ. ఇల జగతాపి ఖడ్గమున
నీల్గిన వీరుని రంభపుచ్చుకో
దలచినఁ దూర్పుదిక్కున
ఘృతాచి కిసుక్కునఁ దుమ్మె నంతలో
పలఁ జనుదెంచె వాని కులభామిని
యగ్ని పథంబునందు ని
ష్ఫలతకు రంభయున్ దెలఁకు
వారిన నవ్విరి దోడికామినుల్.

ఒకానొక ప్రసిద్ధ చరిత్రకారుని తప్పునిర్ణయము నిరూపింప మనము ప్రయత్నించుటలో తీఁగ గదలింపఁబూనిన-పొదఁ గదలించినట్లైనందుకు పాఠకులు క్షమింతురుగాక—

ఇట్లు ప్రతాపరుద్రుని పూర్వులనుండి వారి స్వపక్ష పరపక్షములలోఁ బెక్కండ్రు సాహిణీసంజ్ఞులున్నారు.

(౧) గంగయసాహిణి (౨) జన్నిగదేవసాహిణి (౩) త్రిపురాంతక మహారాజు (సాహిణి) (౪) అంబయదేవసాహిణి అను నీ నలువురును ప్రతిపక్షమువారు.

(౧) గుండయ సాహిణి (౨) మాచయ సాహిణి (౩) సర్వసేనాధిపతి మహారాయ పట్ట సాహిణియ సోమనాయనింగారు- అను నీ ముగ్గురును గాకతీయులకు స్వపక్షమువారు. వీరెల్లరును క్రీ. శ. ౧౨౦౦-౧౨౧౧ ల లోపల నున్నట్లు తెలియవచ్చుచున్నది.

నిశ్శంకవీరబిరుదాంకితులును (౧) మాచయ (౨) గుండయ (౩) జక్కయ (పానుగల్లు శాసనమునుబట్టి) అను ముగ్గురు కానవచ్చుచున్నారు. ఇందు మాచయ గుండయలు సాహిణులగుటేగాక నిశ్శంకవీర బిరుదాంకితులైన సేనాధిపతులుగా నున్నారు. ఇట్లు పరిశీలించి చూచిన రామాయణ కృతిపతియగు సాహిణి మారయ్య యొక కాకతీయ సేనాని యగుటయు, రామాయణ కవులలో నొకని జనకుండైన నిశ్శంక వీరమారయ్య మఱియొక సేనాని యగుటయును సంభవమేయగుచున్నది. ఇద్దరుగాక యొక్క వ్యక్తి యొక్కడే యయినను గావచ్చునను నూహకు సైతమవకాశమున్నదను విషయము నింతకుముందు చర్చించి యుంటిమి. ఆ యూహ యెంతవఱకు సమంజసమో ఇంక యోచింతము.

---

## నాల్గవ ప్రకరణము

విద్యానాథ విరచితమైన ప్రతాపరుద్ర యశోభూషణ మను నలంకారశాస్త్రములోని యొక శ్లోకము—

శ్లో. మురారే ర్యః పూర్వం జలనిధిసుతాయా ముదభవ
స్మహాదేవాజ్జాతః సపున రవనీభృద్దుహితరి
వపుష్మాన్ కామోయం జయతి జగతీభాగ్యవిభవైః
ప్రతాపశ్రీరుద్రః స్వయమితి మనీషా మృగదృశాం.

తా. పూర్వకాలమునం దెవ్వఁడు విష్ణుదేవుని వలన జలనిధి పుత్రి (లక్ష్మీదేవి) యం దుద్భవించెనో ఆ మన్మథుఁడు మరల మహాదేవునిఁ (శివుని) వలనఁ బర్వతపుత్రి (పార్వతీదేవి) యందుద యించెను. (శ్లేష: మహారాజ పదస్థుఁడైన యొకనివలన రాజ పుత్రియైన ముమ్మడమ్మయందు జనించెను అని) కావున శరీర ధారియగు నా మన్మథుఁడే యీ ప్రతాపరుద్ర భూపతియని యువతుల యభిప్రాయము.

ఈ శ్లోకమును జూచి కాఁబోలు నీవల కొందఱు చరిత్ర కారులు "ప్రతాపరుద్రుని తండ్రి మహాదేవరాజు" అని చెప్పు చున్నారు. కాని శ్లేష ప్రధానమైన యీ శ్లోకము నాయకా జ్జ్వల్యమున కుదాహరణముగా వ్రాయబడినది. 'అవనీభృ ద్దుహితరి' అను నీ పదము ప్రతాపరుద్రుని తల్లి పేరెట్లు కాఁజాలదో అట్లే మహాదేవ శబ్దముసైతము నాతని తండ్రిపేరు కాఁజాలదు. అతని తల్లి ముమ్మడాంబ యయినట్లే తండ్రియు నేదోయొక పేరు గలవాడు కావలసియున్నాఁడు కనుకఁ

దండ్రిపేరు విద్యానాథు డెచ్చటను బేర్కొనలేదనియే తలంప వలెను. అతని తల్లిపేరు మాత్రము కవిచే నీ క్రింది శ్లోకమునం బేర్కొనంబడినది. చూడుండు.

కౌసల్యాసీ త్ప్రథమ జననీ దేవకీ చ ద్వితీయా
విష్ణోర్మాతా తదను మహితా ముమ్మడాంబా తృతీయా
యస్త్రేతాయాం రఘుపతిరభూత్ ద్వాపరే శౌరి రాసీత్
త్రాతుం క్షోణీం సజయతి కలౌ వీరరుద్రావతారః.

(నాయక మహామహిమత్వ సందర్భమున) అయితే "మహాదేవాజ్జాతః సపున రవనీభృద్దుహితరి" అను నీ వాక్యమునకు వ్యాఖ్యాతయగు కుమారస్వామి సోమపీథి-"మహాదేవాత్= మహాదేవ నామకాత్ మహారాజాత్, అవనీభృద్దుహితరి=రాజ పుత్ర్యాం" అని వ్యాఖ్యానించి "ఈశ్వరాత్ పార్వత్యామితిచ ధ్వన్యతే" "అత్ర మదనత్వోత్ప్రేక్షయా రూపసంపత్తి రుక్తా" అని వివరించియున్నాడు.

నాటక ప్రకరణములో నున్న—

"భూభృత్సుతా మహాదేవౌ పితరౌ యస్య విశ్రుతౌ
నరనాగాకృతిః శ్రీమాన్ సదేవ శ్రేయసేఽస్తు వః"

అను శ్లోకమునకు గణాధిపార్థమును ముందుగా వ్రాసి పిమ్మట నా వ్యాఖ్యాత—

"సూచ్యార్థస్తు యస్య కథానాయకస్య భూభృత్సుతా రాజపుత్రీ ముమ్మడాంబా మహాదేవ స్తన్నామకో మహారాజః పితరావితి విశ్రుతౌ నరనాగాః=నరశ్రేష్ఠాః. ని॥ సింహశార్దూల నాగాద్యాః పుంసి శ్రేష్ఠార్థగోచరాః ఇత్యభిధానాత్ ఉపమిత

సమాసః, తదాకృతిః=నల నహుష దిలీపాది సదృశః ఇత్యర్థః సదేవోరాజా 'దేవ స్సురే ఘనే రాజ్ఞి' ఇతి విశ్వః." అని వివరించియున్నాఁడు.

ఇందువలన నీ వ్యాఖ్యాత మహాదేవశబ్దము ప్రతాపరుద్రుని తండ్రిపేరని తలంచినట్లే యున్నది. అట్లు విడిగాఁ దలంప వలసిన పనిలేదు. కవి కా యుద్దేశమున్నట్లు కానరాదు. విద్యానాథుఁడు కథానాయకుని మహారాజైన రుద్రదేవుని పుత్రుఁడు గనే ప్రతిఘుట్టమునను వర్ణించుచున్నాడు. అట్లు వర్ణించుటకుఁ గారణము తత్స్వీకార పుత్రత్వమే. కనుక రుద్రమదేవి రుద్ర మహారాజైనట్లే, తద్దౌహిత్రుఁడైన ప్రతాపరుద్రుఁడు తత్ (మహాదేవ) పుత్రుడైనాఁడని మనము గ్రహింపవలెను— అతని తండ్రిపేరు చెప్పనుద్దేశమే అతనికున్నట్లు గానరాదు. ఉన్నయెడల,

శ్లో. కౌసల్యాసీత్ప్రథమ జననీ దేవకీ చ ద్వితీయా
విష్ణోర్మాతా తదను మహితా ముమ్మడాంబా తృతీయా
యస్త్రే తాయాం రఘుపతిరభూత్ ద్వాపరే శౌరి రాసీత్
త్రాతుం క్షోణీం స జయతి కలౌ వీరరుద్రావతారః.

అను శ్లోకమునందువలె నేదోయవకాశము కల్పించుకొని యెచ్చటనో స్పష్టముగాఁ జెప్పియుండువాఁడే. రుద్రదేవాభిధానయైన రుద్రమదేవి కీతఁడు దౌహిత్రుఁడనియు విద్యానాథ కవి యొక సందర్భమునఁ జేర్కొని యున్నాఁడు.

శ్లో. స్వీకృతే పుత్రభావేన దౌహిత్రే పాజ్యమాజ్ఞయా
అస్మి న్నిధేహిధారేయే గుర్వీ ముర్వీధురా మితి.

అని రాజవేషధారిణియైన రుద్రమకు భగవంతుఁడు చెప్పినట్లు నాటకప్రకరణమునఁ గలదు.

ప్రతాపరుద్రుఁ డసాధారణ పండితుఁడనియు మహాకవి యనియు విద్యానాథకవి నాయక ప్రకరణమునందు

శ్లో. గోష్ఠీభిః పరితోషయ న్బుధగణా న్షడ్దర్శనీ సీమభిః
సత్సారస్వత మార్గదర్శనచణైః సూక్తైఃకవీన్ ప్రీణయ న్
సంగీతోపనిషద్రహస్య పిశునై రాతోద్యయోగ్యాక్రమై
ర్దిన్వ న్సంసది వైణికా న్విహరతే శ్రీకాకతీంద్రో నృపః.

అను శ్లోకమున స్పష్టపఱచినాఁడు. ప్రతాపరుద్రుఁడు చక్కని సారస్వత మార్గమును జూపుటలో సమర్థములైన తన సూక్తములచే కవుల సంతోషపెట్టుచున్నాడట. ఇందుకే కాబోలు నాతనికి సరస్వతీ ముఖముకురాయమాణ సారస్వత భట్టబాణ అను విద్వద్బిరుదము వచ్చినది. (విద్యానాథుని పై శ్లోక మీతని బిరుదమును బ్రకటించుచుండలేదా ?)

కావ్య ప్రకరణములో నొక సందర్భమున

శ్లో. విద్యాసముద్రే భువనైకభద్రే
ప్రతాపరుద్రే జితవైరిభద్రే
రక్షావినిద్రే ధృతశౌర్యముద్రే
కాంతేవ పృథ్వీ రమతే గుణార్ద్రే.

అని యతఁ డొక సందర్భమునఁ బ్రతాపరుద్రుని పాండిత్యాదులను వర్ణించియున్నాఁడు.

ప్రతాపరుద్రుఁడు యువరాజుగా నున్నప్పుడే తాని శాస్త్ర రచన చేసినట్లు తెలియజేయుచు

శ్లో. శార్గ్యోష్మా నిరవగ్రహాః ప్రతినృపా
స్సర్వేఽపి నమ్రీకృతాః
పాతివ్రత్య ముపైతి భూ రియ మయం
నాథః స్వయంభూః శివః
ధీరోయం యువరాజ ఏవ వహతి
శ్రీవీరరుద్రో ధురం
సర్వా మిత్యనుమోదతే ప్రతికలం
శ్రీకాకతీంద్రోన్నృపః.

అను శ్లోకమునఁ దత్పితృవాక్య రూపమునఁ బ్రశంసించి నాఁడు.

"కాకతీయులు క్షత్రియులా ? అయినచో వారు సూర్య చంద్రాన్వయులలో నేతెగకుఁ జేరినవారు ?" అను ప్రశ్నలకు సమాధానముగా విద్యానాథుఁడు

శ్లో. తాదృఙ్మర్త్యమలోకభాగ్యవిభవా దింద్రాది బృందారకైః
క్షోణ్యాం క్రీడితుమిచ్ఛుభి శ్చిరతరం సంప్రార్థితః పద్మభూః
అత్యర్కేందు కులప్రశస్తిమసృజ ద్యం కాకతీయాన్వయం
తస్మిన్ సంప్రతి వీరరుద్రవపుషా జాగర్తి లక్ష్మీపతిః.

అను శ్లోకము చెప్పి, కాకతీయు లీ రెండుతెగల క్షత్రియులును గారని (అత్యర్కేందు కులప్రశస్తిం అసృజత్)యు, సూర్య

చంద్ర వంశముల రెంటియొక్క ప్రశస్తిని మించిన ప్రశస్తిగల తదన్యసృష్టిలోని వారనియు జమత్కరించినాఁడు.

రుద్రమదేవి రుద్రమహారాజుగా వర్ణింపబడుట యొక ప్రతాపరుద్రీయమునందు మాత్రమేకాదు. నాఁటి సకల శాసనములయందును నదే యాచారమున్నది. కనుఁక దత్పూర్వ ప్రవృత్తమైన యా యాచారమునే యా కవి పాటించినాఁడనవలె. తదనురూపమైనదే ప్రతాపరుద్రుని తండ్రి ప్రశంస యవసరమైనచోటనెల్ల మహారాజను నర్థముగల యీ మహాదేవ శబ్దప్రయోగము చేయుట యని నా నిశ్చయము.

అట్లుగాక తజ్జనకతండ్రినే కవి యీ పదముచే వ్యక్తము చేసినాఁడనుకొందుమేని యా మహాదేవ శబ్దము తజ్జనకుని నామధేయముగాక ఒకానొక మహారాజనునంతమాత్రపు నిర్దేశము చేయఁదగియుండునని నా యభిప్రాయము— వ్యాఖ్యాతయు మహాదేవశబ్దము కేవలము పేరని గట్టిచేయక పై రెండు ప్రదేశములందును "మహాదేవనామా మహారాజః" అని వ్యాఖ్యానించి యున్నాఁడు. పేరేయగునేని 'మహాదేవ నామా' అనుటతోనే ఆ సందర్భమున నర్థపూర్తి యయ్యెడిది. దానికి రెండవయర్థము సైతము గలదను సూచనయే దాని వెంట 'మహారాజః' అను శబ్దప్రయోగము సైతము చేయుట యని మనము తలంపవచ్చును. అట్లు కాదేని యా మహారాజత్వ విశేషము ప్రత్యేకముగాఁ జెప్పవలసియే యుండదు.

•

# ఐదవ ప్రకరణము

రుద్రమదేవికిఁ బ్రతాపరుద్రుని గేవలము పుత్రుఁడుగనే వర్ణించిన శాసన శ్లోకము సైతము గలదు. దాని నాంధ్రుల చరిత్రమునఁ దద్గ్రంథకర్త

"ఏ శాసనమునందు రుద్రదేవి గణపతి కూతురని చెప్పఁబడినదో ఆ శాసనమునందు రుద్రమదేవికి రుద్రదేవుఁడను కుమారుఁడు గలఁడని యీ క్రింది శ్లోకములోఁ జెప్పఁబడినది." అను పీఠికతోఁ బ్రకటించినాఁడు చూఁడుఁడు.

శ్లో. శ్రీ విశ్వేశ్వర దేశికేంద్ర శివహస్తోద్భాసి దోర్విక్రమః
త్రిక్షోణీశ జగద్దళః ప్రతిబలప్రధ్వంసి జన్మోత్సవః
యస్యాః కాకతివంశ మౌక్తికమణిః శ్రీ రుద్రదేవస్సుత
స్తస్యాః కింకథయామ వైభవ మతః శ్రీ రుద్రదేవ్యాః పరం.

ఈ శ్లోకము కాకతీయ గురువైన శివమహాముని దాన శాసనమునందున్నదట. (శాసనశిల గుంటూరుజిల్లా మంగళగిరి తాలూకాలో శ్రోత్రియాగ్రహారమగు మల్కాపురమను గ్రామములోని విశ్వేశ్వరస్వామి దేవాలయము ముందున్నదట) ప్రతాపరుద్రీయములో నాయకజనకనామముగా గోచరించుచున్న యీ మహాదేవశబ్దము నిజమైన పేరుగాఁ గలవారు నాటి శాసనములలోఁ గొందఱు కానవచ్చుచున్నారు.

అందు మొదటి మహాదేవరాజు గణపతిచక్రవర్తియొక్క తండ్రి.

ప్రోలరాజు వర్ణన తరువాత.

౧. మహాదేవం దేవం య మనుదితఘాలాక్షి మహాసం
భుజంగ వ్యాసంగోక్షిత తను మమన్యంత మనుజాః.

౨. తత్పుత్రో గణపతి (దేవ) నామధేయః
సంజజ్ఞే జలనిధిమేఖలాంభువం యః
దో స్తంభే మణివలయంచకార (శతైః. తప్పు)
దిజ్నాగైః ఫణిపతినా కథంచిదూఢాం

౩. జాతాతస్య పయోనిధేరివ రమా శ్రీరుద్రదేవీసుతా
భాస్వద్భిర్నృపమౌళి రత్ననివ హైర్నీరాజితాంఘ్రిద్వయా
త్యాగేన త్రిదివద్రుమాన్ దశదిశః కీర్త్యా ధనానాం పతిం
లక్ష్మ్యా కించభుజాబలేన విజయం న్యక్కుర్వతీ వర్తతే.

౪. భాగ్యైర్విశ్వస్య తస్యాః
పతి రభవ దథో వీరభద్రాభిధాన
సౌందర్యేణేందు మహ్నాం
పతిమపి మహసా మందభాసౌవితన్వన్
యద్వైదగ్ధ్యం విదగ్ధా
యదురువితరణం యాచకోవా యదాజ్ఞాం
రాజానో యత్ప్రతాపం
విమతనృపతయో జానతే జ్ఞాతభావాః.

౫. జ్యేష్ఠశ్చాళుక్య వంశార్ణ ... ...
... ... ...
... ... ... శివాహ్వాఖ్యః
య త్తేజస్ఫూర్తిపీతై రరినృపతితమస్సంచయై రాశుయాతం

౬. లక్ష్మాంబాయాం సుతోజాతః
(శ్రీ) మహాదేవ రాజతః
సామ్నేందుశేఖరో రాజా
కుమారః శివయోరివ.

౭. ఇందుశేఖర నరేంద్ర నందనే
నందతి స్వయమశేషవందనే
జగ్ముషాం వితరణం రణం ముహుః
స్వస్థతైవ విదుషాం ద్విషామపి.

(వరంగల్లు జిల్లా జనగాం తాలూకా కొలనిపాక శిలాశాసనము.)

ఇది (ప్రమాద్యబ్దేదినే కృష్ణ పంచమ్యాం మృగ సంక్రమే) ప్రమాది సంవత్సర పుష్య బ ౫ మకర సంక్రమ కాలమున వేయబడినది కనుక రుద్రమదేవి కాలమున వచ్చిన ప్రమాది శా. శ. ౧౨౦౨-౩ క్రీ. శ. ౧౨౮౦-౮౧ నాటిది కావలెను.

ఇందుఁ జెప్పఁబడిన కాకతి రాజవంశక్రమము (౧) ప్రోలరాజు (౨) తత్పుత్రుఁడగు మహాదేవరాజు (౩) మహాదేవరాజపుత్రుఁడగు గణపతిచక్రవర్తి (౪) తత్పుత్రియైన రుద్రమదేవి-తరువాతి విషయము రుద్రమదేవి భర్త వీరభద్రరాజనునది. ఇతఁడు విశ్వముయొక్క యదృష్టవశముననే (తస్యాః) ఆ రుద్రమదేవికి భర్త యయ్యెనట. ఈతనిని వర్ణించు శ్లోకము పూర్తియైన పిమ్మట, "జ్యేష్ఠశ్చాళుక్య వంశార్ణవ" అని యారంభింపఁబడిన శ్లోకమున ప్రథమ పాదముయొక్క తరువాతిభాగము, ద్వితీయ పాదము పూర్తిగా, తృతీయ పాదములోఁ గడపటి యక్షర

ములు (శిష్టాషైః) అనునవి తక్క తత్పూర్వభాగమంతయుఁ బూర్తిగా మాసిపోయినది. అయినను రుద్రమదేవి భర్తయైన వీరభద్రరాజు చాళుక్యవంశజుఁడనుట స్పష్టపడుటయేకాక, యతనికి జ్యేష్ఠుఁడో, లేక యతఁడే జ్యేష్ఠుఁడుగాఁ గలవాఁడో అగు నొకపురుషుఁడు వర్ణింపఁ బడినాఁడనునది కూడ మిగిలి యున్న శ్లోకారంభమువలనఁ దెలియవచ్చుచున్నది.

ఈ శ్లోకముయొక్క తుదిపాదమున్నను నది కేవలము వర్ణనాత్మకమైనందున దాని ప్రయోజనము లేకపోవుచున్నది. తరువాతి శ్లోకమువలన నందుఁ జెప్పఁబడిన చాళుక్యవీరభద్రుని భ్రాత మహాదేవరాజనియు, నతని భార్య లక్కాంబ యనియు, నీ దంపతులకు నిందుశేఖరుఁడను కుమారుఁడు గలఁడనియు, విస్పష్టమగుచున్నందున విషయ నిర్ణయమునకు మాత్రము భంగము గలిగినదిగాదు.

ఇది కాకతీయుల వియ్యపువారి యుద్యోగి వ్రాయించిన శాసనము గావున రుద్రమదేవిని రుద్రదేవమహారాజని వ్యవహరింపలేదు. తద్భర్తృవంశమును దన్నామమును స్పష్టముగా గూడ నిందుఁ జెప్పబడినవి, ఆంధ్రుల చరిత్రలో కీ. శే. వీరభద్రరావుగారు రుద్రమదేవి గణపతి చక్రవర్తి కిఁ బుత్రిక యనునంతవఱకు మాత్రమే మల్కాపురము శాసనమువలన నిర్ణయింపఁగలిగినారు కాని, యామె భర్త యెవ్వరైనదియు నిర్ణయింపలేక యది తెలియు నవకాశము బొత్తిగాలేదని స్పష్టబఱచియున్నారు, కనుకనే యీ శాసనమును వారు పరికింప లేదని తెలిసిపోయినది.

ఆంధ్రులచరిత్రకారుని మఱియొక సందిగ్ధ వాక్యమునకు గూడ మనముదాహరించిన కొలనిపాక శిలాశాసనము చక్కని సమాధాన మైనది. ఆ సందిగ్ధవాక్యము "ముమ్మడమ్మ (రుద్రమ దేవి కూతురు) చాళుక్య వంశోద్భవుఁడైన వీరభద్రరాజున కిచ్చి వివాహము చేయఁబడియెనని స్థానిక చరిత్రమునుబట్టి తెలియు చున్నది గాని ముమ్మడమ్మ భర్తయొక్క చరిత్రము లేశ మాత్రము దెలియరాకున్నది." అనునది.

రుద్రమదేవిభర్త చాళుక్య వీరభద్రుఁ డగుటవలన నామె బిడ్డయగు ముమ్మడమ్మకు చాళుక్యులు పుట్టినింటివా రగుదురు. కనుక నామెకుఁ జాళుక్యుఁడెవ్వఁడును భర్త కాజాలఁడు. ఇట్టి సంప్రదాయవిరుద్ధములైన కార్యములెవ్వియు నిప్పటివలె నాకాలమున జరుగుచుండెననుట కేయవకాశములును లేవు. అయితే రుద్రమదేవి మగడు ఫలానివాఁడనికాని, ఫలానివంశము వాఁడనికాని తెలుపు సాధనములు దొరకనందున స్థానికచరిత్ర వాక్యములోని దోషమును వారు చూపలేకపోయినారు. ఇప్పు డా వీరభద్రు డా ముమ్మడమ్మకుఁ దండ్రియని స్పష్టపడి నందునఁ జారకు లా సందేహమును బొందరు—

ఈ కొలనిపాక శాసనమూలమునఁ గాకతీయుల నాటి యిద్దరు మహాదేవనాములైన రాజులపేర్లు బయటఁ బడినవి. ఈ యిద్దరిలో మొదటి మహాదేవరాజు కాకతీయుఁడును రుద్రమదేవి పితామహుఁడునై యున్నాఁడు. రెండవ మహా దేవరాజు చాళుక్యుఁడును, రుద్రమదేవి భర్తృసోదరుఁడును నై యున్నాఁడు. కనుక నితఁడు ముమ్మడాంబకు పెదతండ్రియో

పినతండ్రియో యగును. వీరిలో నెవ్వరును బ్రతాపరుద్రుని తండ్రియగు నవకాశము లేదుకదా!

మూఁడవ మహాదేవుఁడా ప్రతాపరుద్ర చక్రవర్తియొక్క మహాప్రధాని యగు పురవరి మహాదేవనాయకుఁడు. ఇతని దానశాసనమొకటి మెదకుజిల్లా చేకుమాలలోని యాంజనేయ దేవాలయమునం దున్నదట. అది తెలంగాణా శాసనసంపుటిలో 48 వదిగా దాని 91 వ పేజీలోఁ బ్రకటింపఁబడినది. దాని లేఖనకాలము శా. శ. ౧౨౩౦ అయినందున క్రీ శ. ౧౩౦౮ కి సరియగుచున్నది. ఇతనిని మనము విచారించుసందర్భమున నాలోచించుటకు సైతము వీలుండదు.

నాలుగవ మహాదేవుఁడు దేవగిరి యాదవ రాజైన మహాదేవరాజు. ఇతఁడు కాకతీయులకు గర్భశత్రువు. మఱియు బ్రతాపరుద్ర మాతామహియైన రుద్రమదేవికంటె వయస్సునఁ గొంత పెద్దవాఁడనిసైత మూహింపఁ దగినవాఁడు. ఇట్టి యీ మహాదేవుఁడు రుద్రమదేవి కల్లుఁడని తలంప వీలులేదుగదా.

ఇట్లు మనకుఁ దెలియవచ్చిన యీ కాలపు మహాదేవ రాజులు నలుగురును గాకపోగా నికఁ బ్రతాపరుద్రుఁడు మహాదేవపుత్రుఁ డనుట కేమహాదేవుని వెదుకుదము? అంతటి యప్ర సిద్ధుఁడు చక్రవర్తినియైన రుద్రమదేవి కల్లుఁడు గాఁజాలునా?

ప్రతాపరుద్రీయకవి శ్లేషకొఱకు మహారాజార్థమున నీ మహాదేవశబ్ద ముపయోగించెనను నా నిర్ణయమునకే నేను మరలఁ దిగివచ్చి - భాస్కర రామాయణములోని యయోధ్య కాండ కవియును, నతని తండ్రియైన నిశ్శంకవీరమారయయుఁ,

కాకతీయ ప్రతాపరుద్రుఁడును, దత్పితయు నగుదు రేమో యను పూర్వోక్తచర్చనే కొనసాగింపఁబూనితిని. అందుపైవచ్చు నాక్షేపణములు చాలవఱకు నా దృష్టిలో విఱిసిపోయినట్లే భావించుచున్నాను. అయినను దీనిపై నింతకంటె సరియైన నిర్ణయమెవ్వరైనఁ జేయఁగలిగినచో నాకంటె సంతోషింపఁగలవారు మఱియొకరుండరని విజ్ఞులకు నివేదించుకొనుచున్నాను.

వెనుక అయోధ్యాకాండకవి యొక్క జనకుఁడగు నిశ్శంక వీరమారయ్యయుఁ దత్కృతిపతియైన సాహిణిమారయ్యయు నొక్కఁడే యను నవకాశమున్నదా ? అను విషయమును జర్చించుచు దాని యవాంతర విషయముగాఁ గ్రొత్తకథ నారంభించి చాలదూరము నడచితిమి. ఇప్పుడు మరల నచ్చటికే పోయి తదనంతర విశేషముల నరయవలసియున్నది.

సాహిణి మారయ్య రుద్రమదేవియొక్కయు, నామె మనుమని యొక్కయు రాజ్యకాలమున నుండెననుట పలనాటిలోని మాచయ సాహిణియొక్క క్రీ. శ. ౧౨౧౧ నాఁటి శాసనమువలనఁగూడఁ ధ్రువపడినందున నీవిషయము నింకను జర్చింప నవసరముండదు. శాసన కాలము నాఁటికి సాహిణి మారయ గుండయలు జీవించియే యుందురని తలంపఁ బనియుండదు. అందును మారయ కడపజిల్లాలోని యంబయ సాహిణి తిరుగుబాటు నాఁటికినైతము లేడను నవకాశమున్నది. ఆ కాలమున క్రీ. శ. ౧౩౦౪ వఱకును అంబయదేవుని శాసనములు గానవచ్చుచున్నట్లాంధ్రుల చరిత్రమున వ్రాయఁబడినందున సాహిణి మారయ క్రీ. శ. ౧౩౦౪కు లోపలనే మరణించి

యుండవలెను. కనుకనే యీప్రాంత యుద్ధమున నాతఁడు పాల్గొన్న వాఁడుకాఁడు. అప్పటి కాకతీయ సర్వ సేనాని "మహారాయ పట్టసాహిణి సోమయనాయ"డని శ్రీ వీరభద్ర రావుగారు వ్రాసిన సహేతుక నిర్ణయమును మనమంగీకరింప వలసినదే. ఇట్టి యీ సోమయసాహిణి మారయసాహిణి కెట్టి సంబంధము గలవాడో తెలియదు. తిక్కనసోమయాజి నిర్వచ నోత్తర రామాయణ పీఠికలోఁ బేర్కొన్న గంగయసాహిణి కాయస్థజాతివాఁడట. కడప మండలములోని పుష్పగిరి శాసనము నందున్న యేతద్వర్ణనాత్మకమగు—

శ్లో. "యో గండ పెండేరక నామధేయః
కాయస్థ వంశోద్భవ కర్ణధారః
శ్రీగంగ సేనాపతి రస్యకాంతా
కాంతి ర్హిమాంశోరివ కౌబలాయః."

అను శ్లోకమును శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు తమ ఆంధ్రుల చరిత్రములో నుదాహరించి యున్నారు. గంగ యను గండపెండేరకనామధేయుఁడనుటలో నొక విచిత్రార్థ మున్నది. "ఆతనిని గాయస్థుఁడు లేక కాయస్థవంశజుఁడు" ననక, "వంశోద్భవ కర్ణధారః" అనుటలో నేమి యభిప్రాయమో తెలియదు. దీనిని బరిశీలింపవలయునన్నఁ జాల కష్టమగు నట్లున్నది. అంతేగాక శ్రీ వీరభద్రరావుగారు రక్కెసగంగును, సాహిణి గంగును నొక్కనిగనే భావించియున్నందున నీశ్లోక మే గంగును గూర్చినదో చెప్పుటకు వీలుగాకున్నది.

అదే ఆంధ్రుల చరిత్రలోని యెనిమిదవ ప్రకరణములో (౨౪౧ వ పేజి) బుద్ధవర్మ వంశమునఁ బుట్టిన కొండవడమటి బుద్ధరాజును గూర్చి (శ్రీ) రావుగారు తచ్ఛాసనోక్తములుగాఁ గొన్ని విశేషములు తెలిపియున్నారు. అందు ముఖ్యమైనది యా బుద్ధరాజు వెలనాఁటి చోళులకు ముఖ్యబంధువనుటయు దుర్జయవంశాభరణుఁడనుటయు నగును. దుర్జయవంశమున బుద్ధవర్మయను రాజు పుట్టెనట. తరువాతఁ దత్పరంపరలో మండరాజుదయించెనట. ఆ మండరాజుకు గండమరాజును, వానికి రెండవ మండరాజును, ఆ రెండవ మండరాజుకు వరుసగా గుండాంబికయందు (౧) మల్లరాజు (౨) బుద్ధరాజు (౩) అంకమ లేక అక్కమ అనువారు పుట్టిరట. ఇందు బుద్ధరాజుకు దుర్జయకులాభరణుఁడు, ఏలాదయసింహుఁడు, అణెయాంకభీముఁడు, నను బిరుదములుగలవట. ఈతని చెల్లెలైన అక్కమ్మ వెలనాఁటి రాజేంద్రచోళుని భార్యయట. మఱియు నీ బుద్ధరాజు శాసనములు కొండవడమటిసీమలోఁ జేరిన నరసరావుపేట తాలూకా నాదెండ్లలోనూ, గుంటూరుతాలూకా చేబ్రోలులోను గలవట. ఈ బుద్ధరాజు యొక్క పితామహుఁడు గండమరాజట - ఇందలి గండమ శబ్దము గండపెండేరక శబ్దము యొక్క సంగ్రహారూపమేమో. అట్లయిన నీతనికో యీతని పూర్వులలో నొకనికో యిది మొట్టమొదట బిరుదనామముగా నుండి - తద్వంశజులకు నామధేయముగాఁ గూడఁ బరిణమించియుండునేమో. అట్లే యగునేని గండపెండేరక నామధేయుఁడైన గంగయసాహిణి తద్వంశజుఁడా? ఏమి? అనునూహాకాస్పదమైనది. తమ

పూర్వుల పేర్లను దమ కొడుకులకుఁ బెట్టుకొను నాచారము ప్రసిద్ధమైనదిగదా! ఇందుచే సాహిణి గంగయ్య యీ వంశము వాఁడైనను గావచ్చును. ఒకవేళ సాహిణి మారయ్యాయు నే తద్వంశీయుఁడే యైనఁ గావచ్చును. సాహిణి మారయ్యకుఁ బుణ్యముగా దానముచేసి, క్రీ. శ. ౧౩౧౧లో శాసనము వేయించిన సాహిణి మాచయ్య యను సేనాని గురిజాల పింగళి స్థలములు చేరియున్న పలనాటిసీమ కధికారియని శ్రీ రావుగారు వ్రాసియున్నారు. సాహిణి గంగయ్యకుఁ గుమారుఁడో తమ్ముఁడో యగునని రావుగారూహించిన త్రిపురాంతక దేవమహారాజు రుద్రమదేవి (కాకతి) కిఁ బ్రధానియు సేనాధిపతియునై తన శాసనములో "శ్రీ మన్మహామండలేశ్వర బాహాత్తరనియోగాధిపతి - అనేక దేశాధిపతి - చాతుర్వర్ణ్యసముద్ధరణ, పశ్చిమరాయ-దామోదరదిశాపట్ట - ఏకాంగ వీర, వీరావతార, అతివిష మహాయారూఢప్రౌఢరేఖా రేవంత, విజయలక్ష్మీకాంత, నాయక నారాయణ, కదనప్రచండ స్తంభ స్తంభిత సకల క్షితిపాల శౌర్య యశస్తోమ తిలకితదిగంగనాముఖ వితరణగుణ వినిర్జిత కామధేను కల్పద్రుమ, *ప్రణత సకలనరపతి మణిమకుట కోటి మకరికా చుంబమాన చరణనఖ కిరణ కందళ, కాకతి కుల తిలక రుద్ర* దేవ మహారాజ చరణనళిన యుగళ సమారాధన సమధిగత సకల రాజ్యాధిపత్య మహావిభవ, చలమర్తిగండ, మూరు రాయ జగదళ మండలీక బ్రహ్మరాక్షస గండపెండేర త్రిపురాంతక దేవ మహారాజులు" అను తన బిరుదములను బ్రకటించుకొనినాఁడనని వారు వ్రాసియున్నారు. ఈ సేనాని కున్న బిరుదము లనేక

ములు సాహిణి మారయ్యకును నున్నట్లు భాస్కర రామాయ ణాశ్వాసాద్యంత పద్యములను బట్టి మనము నిర్ణయింపవచ్చును. కాబట్టి యీ త్రిపురాంతక, దేవమారయసాహిణుల కేదో సంబంధమున్నదనక తప్పదు. ఇద్దరును సమకాలికులగుటయుఁ గానవచ్చెడిని.

సాహిణి మారయ్య కొండసీమ రాజని వాఁడుక యున్నది. అందుకుఁ దగినట్లు మాచయ సాహిణి యీ సన్నిహిత దేశమునకుఁ గాకతీయుల కాలమునఁ బాలకుడుగా నున్నాఁడు. వెనుక వ్రాయఁబడిన కొండ పడమటి బుద్ధరాజు వెలనాటి రాజేంద్రచోళుని (క్రీ. శ. ౧౧౩౦-౧౧౮౦ ప్రాంతము) బావ మఱఁది యగుటచే నీ మొదటి బుద్ధరాజుకు మనమఁడొకడుండి యతని పేరు గూడ బుద్ధరాజే యైనచో సాహిణి మారయ్య యీ బుద్ధరాజు కొడుకైనఁ గావచ్చును. అట్లయిన ముత్తాత మనుమల నడుమ రమారమి ౮౦-౯౦ సంవత్సరముల కాల భేద మున్నట్లు తేలును. అది సరియైన కాలమే - కాని అందుకు వలయు సాధనములు కాలగర్భమున నున్నవి.

ఇట్లు భాస్కర రామాయణాయోధ్యా కాండ కవియగు కుమారరుద్రదేవుఁడు కాకతీయ (ప్రతాప) రుద్రదేవుఁడే కావచ్చుననుటకును, ఆ కవి తండ్రియైన నిశ్శంక వీరమారయ్య సాహిణి మారయ్యయే కావచ్చుననుటకును, అతఁడొక రాజ కుటుంబ సంభవుఁడే కావచ్చుననుటకును - గాకతీయులకు సర్వ సేనాధిపతిగనేకాక యింటి యల్లుఁడుగాగూడ నుండవచ్చుననుట కును గల అవకాశము లన్నియుఁ బూర్తిగాఁ జర్చింపబడినవి

విద్యానాథకవియుఁ బ్రతాపరుద్రుని యసాధారణ పాండిత్యమును "గోష్ఠీభిః పరితోషయన్ బుధగణాన్ షడ్దర్శనీసీమభిః" అను వాక్యముచేతను, (విద్యాసముద్రే) విద్యాసముద్రుఁడన్న ప్రశంసా విశేషముచేతను, బ్రకటించుటయేకాక, "సత్సారస్వత మార్గదర్శన చణైస్సూక్తైః కవీన్ప్రీణయన్. అను ప్రత్యేక వర్ణనచేత నాతని యసాధారణ కవితాప్రాభవమును గూడ స్పష్టపఱచినాడు. ఇంతేకాక "సంగీతోపనిష ద్రహస్య పిశునై రాతోద్య యోగ్యక్రమైః ధిన్వన్ సంసదివైణికాన్" అను ప్రత్యేక వర్ణనచే నాతని సంగీతాది వివిధ కళాకౌశలము గూడ బ్రశంసించినవాఁడైనాడు.... ఇదియంతయు కుమారరుద్రదేవుని యయోధ్యాకాండాంత గద్యములోని వివిధ విశేషణములను బోషించునదిగనేఁ యున్నదనక తప్పదు.

## ప్రతాపరుద్రుని జన్మకాలము

గణపతిచక్రవర్తి మరణానంతరము తత్పుత్రియైన రుద్రమదేవి రాజై, తన బిడ్డయగు ముమ్మడమ్మకు సంతానము లేనందున దేవతాప్రార్థన నిమిత్తము రాజధానికి సమీపములోనున్న గ్రామాంతరము పోగా, దేవగిరి యాదవరాజోరుగంటికి దాడివెడలి వచ్చినట్లు స్థానికచరిత్రములందుఁ గలదని కొందఱు వ్రాసియుండిరి. అది నిజమైన గణపతిచక్రవర్తి మరణకాలమగు క్రీ. శ. ౧౨౬౦ నాఁటి రౌద్రికిఁ బిమ్మటనే ప్రతాపరుద్రుని జన్మ మనవలసియుండునుగదా? ఆంధ్రుల చరిత్రలో స్థానిక చరిత్రములందు జెప్పఁబడినదని యొకకాలము వ్రాయబడినది. అది "శా. శ. ౧౧౮౮ వదియగు నందనసంవత్సర చైత్రశుద్ధ

పంచమీ గురువారమునాఁడు రోహిణీ నక్షత్రమున బ్రాహ్మీ ముహూర్తమునందు సూర్యాంగారక బృహస్పతు లుచ్చస్థాన గతులై శని నిజస్థానమున నుండఁగా ముమ్మడాంబ గర్భమునఁ బ్రతాపరుద్రుఁడు జన్మించె" ననునది. ఆ చరిత్రకారుఁడీవాక్యముల నుదాహరించి దీని ప్రకారముగాఁ జూచినచో క్రీ. శ. ౧౨౬౦లో గణపతిచక్రవర్తి మరణించినందున ఆ కాలమునకు బ్రతాపరుద్రుడు 16 సం॥ ల వయస్సువాఁడై యుండవలెననియు, నంత పెద్ద వాఁడైన మగవారసుడుండఁగా గణపతిచక్రవర్తిరాజ్యము నతని కొసంగక స్త్రీయైన తన బిడ్డకిచ్చునా? అని యొక సందేహము చూపి దానిని ద్రోసివేసినారు. శా. శ. ౧౧౬౬ అనిన క్రీ. శ. ౧౨౪౪ అగుట సహజమే. ఆ కాలము పై చక్రవర్తి మరణ కాలమునకు ౧౬ సం ల పూర్వపు దగుటయు నిజమే. అయినను ౧౬ సం.ల పుత్రికా దౌహిత్రుఁ డుండ బిడ్డకు రాజ్య మొసగుట సంభవము గాదన్న వారి వాద మత్యంత దుర్బలమైనది. స్త్రీ యైనను సర్వసామర్థ్యములుగల బిడ్డయుండ నామె దౌహిత్రునికి రాజ్య మిచ్చియుండగూడు ననుట, సంగతమైన హేతువాదము గాదు. బిడ్డకంటె బిడ్డ మనుమడు ౧౬ సం.ల బాల్యాశేషమున నున్నవాఁడు రాజ్యార్హుఁడని వివేకశాలి యెవ్వఁడును దలపడు. అది యట్లుండనిచ్చి చర్చింపఁదగిన యంశము వేఱొకటున్నది. శా. శ. ౧౧౬౬ కు నందన సంవత్సరము రాదు. అది క్రోధి సంవత్సరమో విశ్వావసు సంవత్సరమో యగును. దానికి సరి యైన క్రీస్తు శకాబ్ద సంఖ్య (శా.శ. ౧౧౬౬-౭౮) ౧౨౪౪ అగుట మాత్రము నిజమే కాని సంవత్సర వ్యత్యయము రాఁగూడదు

గదా. ప్రతాపరుద్ర జన్మ సంవత్సరము నందన యన్నందున ఆ నందనకు సరియైన శకాబ్దములు ౧౧౫౪-౧౧౫౬. దానికి క్రైస్తవాబ్ద సంఖ్య ౧౨౩౩ మాత్రమే. అది యాతని జన్మ వత్సర మగునేని ప్రతాపరుద్రుడు తన తల్లి మాతామహుని మరణ కాలమునకు ౧౬ సంవత్సరముల వాఁడు గాక ౨౭ సం.ల వయస్సు వాఁ డనఁదగును. శకాబ్దములును, సంవత్సర నామ మును గూఁడ దప్పుబడిన దనుకొందుమేని అప్పుడది ౧౧౭౬ గనూ సంవత్సరము తప్పనుకొందుమేని అది యానందగను, దిద్దుకొనఁదగి యున్నది. తెలుగులో,౭ చక్కగాఁబడనిచో, లేదా కొంత చెడినచో దానినెత్తి వ్రాయు వా డాస్థానములో ౬ నూహించుట సాధారణమే. అట్లై ఆనందలో 'ఆ' లోపించినచో అనగా మొదటి యక్షరము మాసియున్నచో నంద-నందన యగును. (లేఖకుఁడు తన పాండిత్యము కొంత చూపినచో నంద చివర 'న' చేర్పఁబడి యది నందన యగును.) కనక నిట్టిప్రమాద పతితములను సవరించుకొనఁ దలచినవాఁడు తక్కిన అన్ని విషయములను జక్కగాఁ బర్యాలోచించి మొత్తములో నెంత వఱకు నమ్మవచ్చునో అంతవఱకు మాత్రము నిలిపి, తక్కిన వానిలో సరిపోని స్వల్పాక్షర భేదములను సరిచేసికొనవలసి యుండును.

అంతేకాని బహు విశేషములతోఁ జెప్పఁబడిన ముఖ్యాంశ మును ప్రమాద సామాన్యముగల తక్కిన స్వల్పాక్షర పదముల యర్థము గుదురలేదని త్రోసివేయుటంత సమంజసము గాదు.

నా యభిప్రాయము ప్రకారము ప్రతాపరుద్ర జన్మ

కాలము శా. శ. ౧౧౭౬కు సరియైన ఆనంద సంవత్సర చైత్ర శుద్ధ పంచమీ గురువారమునాఁటి ప్రభాతకాలము. శా. శ. ౧౧౭౬కు క్రీ.శ. ౧౨౫౪ సరియైనది. ఇట్లైన గణపతిచక్రవర్తిమరణ కాలమునకు ౬ సంవత్సరముల అర్భకుఁడు ప్రతాపరుద్రుఁడు. తద్రాజ్యారంభమతని ౩౬-౪౦ సంవత్సరములలోపలిది. అయిననే దిగ్విజయాదులకు సామర్థ్యము గలవాఁడై ఆ కార్యములు నిర్వ హించి వృద్ధురాలైన అవ్వవలన రాజ్యాభిషేకము పొందనాఁడు.

అతఁడు పట్టుబడిపోవునాటికి (క్రీ. శ. ౧౩౨౩) ౬౯-౭౦ సం. ల వయోవృద్ధుఁడు గానోపును. కొంత వార్ధకములోనే యాతఁడు శత్రువులకుఁ బ్రమాదవశమున జిక్కినట్లు కొన్ని కథలు గూడ లోకమునఁ బ్రవృత్తములై యున్నవి. జ్యోతి శ్శాస్త్ర సిద్ధాంతము ప్రకారము గణితముచేసి చూచినచో గ్రహస్థితి సయితము సరిపోవచ్చునని తోచుచున్నది. కాకతీయ చరిత్రమును దెలుపు సోమదేవరాజీయమునఁ బ్రతాపరుద్రుని సభలో హులశిక్కి భాస్కరుఁడు మొదలుగాఁ గల ప్రబంధ కవు లిన్నూరుగురును అశ్వంబులకధికారియైన సాహిణిమారన్నయు నున్నట్లు చెప్పఁబడినందుల కనురూపముగనేయున్నది మాచయ సాహిణి యొక్క పలనాటి శిలాశాసనము. సాహిణి మారన్న కొండసీమకు రాజని కొందఱు వ్రాసియున్నారు. కొండసీమ యనునది కొండపల్లిసీమయో, కొండపడమటిసీమయో, నాగా ర్జునకొండ సీమయో కాఁదగియున్నది.

సాహిణి మారన్న రామగిరిదుర్గాధ్యక్షుఁడైన చళుక్య చొక్కరాజు మీదికి దాడివెడలినట్లును వేములవాఁడ భీమకవి

యాతని నా సందర్భమున శపించినట్లును, లక్షణగ్రంథములందుఁ జెప్పఁబడినదిగదా! ఆ రామగిరిదుర్గ మెచ్చటిదో విచారింతము. ఇదే పేరుగల దుర్గమొక్కటి గోదావరిజిల్లాలో రాజమహేంద్ర వరసమీపమున నున్నదట. వేములవాడ గూడ నా ప్రాంతము ననే యున్నందున భీమకవి యచ్చటివాఁడై యా రామగిరి దుర్గాధిపతియగు చాళుక్యచొక్కరాజు నాశ్రయించియుండినట్లు నేఁటి చరిత్రకుశలు లూహించుచున్నారు. చిత్తూరు జిల్లాలో మఱియొక రామగిరి యున్నట్లును వినుచున్నాము. కాని తెలంగాణాలోని కరీమునగరంజిల్లాలోనున్న రామగిరి పూర్వము మిగులఁ బ్రసిద్ధమైనది. దీని సమీపమున నున్న వేములవాడఁ గూడ మిక్కిలి ప్రసిద్ధమైనది. చాళుక్య చొక్కరాజు నివాస మీ రామగిరియే యనుట యుక్తము. భీమకవి నివాసస్థానము సైతము దాని సమీపమున నున్న వేములవాడయే యనుట న్యాయ్యము.

ఈ వేములవాఁడలోఁ బూర్వ చాళుక్యవంశజుల శాసనములు గొన్ని యున్నవి. వానిలో చాళుక్య విక్రమ సం. ౮ అగు రుధిరోద్గారి సంవత్సరోత్తరాయణ సంక్రాంతినాఁడు వేయఁబడిన శాసనము రాజాదిత్యుఁడను చాళుక్య రాజుది. ఇది క్రీ. శ. ౧౦౮౩ డిసంబరుకు సరియైన కాలము గావున, నేఁటి కొకింత తక్కువగా ౯౦౦ సం.ల నాఁటిది. ఆ కాలమునఁ జాళుక్య విక్రమాదిత్యునికి సామంతుఁడైన రాజాదిత్యుఁడు వేములవాఁడ రాజధానిగాఁ జేసికొని దేశపాలనము చేయుచునందు రాజాదిత్యేశ్వర దేవుని కాలయము కట్టించి తత్ప్రతిష్ఠఁ

గావించినట్లు చెప్పఁబడినది. ఇందు రాజాదిత్యుని బిరుదావళి యంతయుఁ జెప్పబడినది. కాని యింతకంటె నీతని పౌత్రుఁడో ప్రపౌత్రుఁడో యైన రెండవ యరికేసరి శాసన మీ వంశము యొక్క యనేకవిశేషములను దెలియఁజేయుచున్నది. మూల పురుషుఁడైన యుద్ధమల్లుఁడను బిరుదముగల వినయాదిత్యుఁడు సపాదలక్షగ్రామయుక్తమైన దేశము నప్రతిహతాజ్ఞుఁడై పాలించుచు స్వభావదుర్గమమైన చిత్రకూట దుర్గమును జయించెనట. అతని పుత్రుఁడు వేంగీదేశమును బలిమిమైనాక్రమించి (బలాద్గృహీతాఖిలావేంగిదేశః) న అరికేసరి నృపాలుఁడట. ఈ మొదటి యరకేసరికి రాజాదిత్యుఁడను నామాంతరముగల నరసింహ ధర్మనృపతియు, నాతనికి యుద్ధమల్లు (రెండవ) డును వానికి నరసింహదేవుఁడును నతనికి రెండవ యరకేసరియు జనించిన ట్లిందుఁ జెప్పబడినది. ఈ రెండవ యరికేసరి వృత్తాంత మీ శాసనమునఁ గొంత విస్తారముగాఁ జెప్పఁబడినది. ఇతఁడు కోపించిన మాత్రమున గోవిందరాజు హారణమును బొందెనట. బిజ్జకు రక్షింపఁబడియెనట - (శ్లో. క్రుద్ధే గోవిందరాజో హారణ మువగతో రక్షితో యేన బిజ్జః) ఈ గోవిందరాజు పశ్చిమ చాళుక్య సేనాధిపతియై ౧౧౨౭-౨౮ ప్రాంతమునఁ బ్రాచ్యదేశమును జయించిన గోవిందరాజే - ఇతఁడు కాకతి ప్రోలరాజుచేతఁ గూడ జయింపఁబడినట్లు హనుమకొండ వేయిస్తంభాలగుడి శాసనము నందుఁగలదు. కనుక నీఅరికేసరియు, నాప్రోలరాజును మిత్రులై యుందురేమో అని యూహింపవలసి యున్నది. శాసనమునఁ గాలము వేయఁబడలేదు. కాని యీఁతడు ప్రోలరాజు కాలము

వాఁడని పై గోవిందరాజ జయమునుబట్టి చెప్పవచ్చును. ఇంతే కాక యీతని ప్రపితామహుని శాసనము క్రీ. శ. ౧౦౮౭ నాఁటిదున్నందున నీతఁడు క్రీ.శ. ౧౧౫౦ ప్రాంతమున నుండునని మనమూహింపవచ్చును. యుద్ధమల్లుని శాసనమొకటి బెజవాడ యొద్ద గలదు. దానినిబట్టి యాతఁడు వేంగీ చాళుక్యశాఖకుఁ జెందినవాఁడని నిర్ణయింపఁబడినది. కనుక నీ రెండవ యరికేసరి పూర్వ చాళుక్యవంశజుఁడనక తప్పదు - వేములవాఁడ ప్రాంత దేశము రాజాదిత్యుని తరువాత నేకారణముననో క్రీ. శ ౧౧౦౦ ప్రాంతమునఁ బశ్చిమ చాళుక్య రాజకుమారునిచే నాక్రమింప బడినట్లందలి మఱికొన్ని శాసనములవలనఁ దెలియుచున్నది. కావున నీ యరికేసరి మరల వారి సేనాని నోడించి దానిని గొనినట్లున్నది. తరువాత నీ వంశజుల చరిత్రము దెలియదు. కాని కాకతి గణపతిచక్రవర్తి కాలమునకీవంశము రెండు శాఖ లుగా విడిఁబడి యందొక శాఖ నేఁటి వరంగలుజిల్లా కొలనిపాక యందును, మఱియొక శాఖ కరీంనగరంజిల్లా రామగిరియందును నిలిచిపోయినట్లు తలంపవలసి యున్నది. కొలనిపాక చాళుక్య వంశజుఁడగు వీరభద్రరాజు గణపతిచక్రవర్తి కల్లుఁడైన విషయ మిదివరకే వ్రాసియుంటిమి. రామగిరిచాళుక్యవంశమునఁ బుట్టిన చొక్కరాజు యాదవ సామంతుఁడైనట్లు తోఁచుచున్నది. కనుకనే రుద్రమదేవి రాజ్యారంభకాలమున యాదవులకు నాంధ్రులకును జరిగిన ఘోరయుద్ధములో సాహిణిమారయ్య చొక్కరాజుతో బోరాడుట సంభవించియుండును. భీమకవి శాప మున నాతఁ డందు మరణించి యుండునేమో! అట్లగుటచేత నే

కాబోలు భాస్కర రామాయణ రచన కేవో కొన్ని యాటంకములు వచ్చియుండవలెను. ఇంతటితో నీ చారిత్రక చర్చను సమాప్తముచేసి కుమార రుద్రకవి కవితావిశేషములు గొన్ని పాఠకులకు దెలియుటకై యందలి పద్యముల నుదాహరించుచున్నాను.

అయోధ్యాకాండములోని రుద్రదేవునిపద్యములు గొన్ని—

ఉ॥ బంధులు మంత్రులున్ భరతుఁ బట్టరు,
రాముఁడు పెద్దవాఁడు, స
ద్బంధురదోర్బలుండు గుణభాసియు నౌ
సుతుఁ డుండ నాసుతున్
సింధుపరీత ధాత్రి కభిషక్తుని
జేయునె భూవిభుండు, సం
బంధముగాదు చిక్కితి నుపాయ
మెఱింగినఁ జెప్పు మంథరా. ౧౪

ఉ॥ వేఁడిన వేఁడిమాట నృపవీరుఁడు
సైపక కర్ణరంధ్రముల్
సూఁడినభంగిఁ దాకుటయు స్రుక్కి
మనంబున నొచ్చి నిన్ను నే
నాఁడు నృపాలపుత్త్రియని నమ్మి
వరించితిఁగాక యిమ్మెయిన్
నేఁడొక కాలసర్పమును
నీవిటు సేయుట నాకుదోచెనే. ౧౫

చ॥ అళికుల మల్లనల్ల నవహల్లక
మొల్లక కేసరోల్లస
ద్దళదరవిందమందిరవితానము చేర
నగాధ దీర్ఘికా
జలజనవీనగంధములు చల్లుచుఁ
జల్లని గాడ్పు లిమ్ముగాఁ
బోలయు గృహప్రదీపములు
పోఁడిమిదూలఁ బ్రభాతమొప్పినన్. ౨౯

చ॥ జననివి నీవుఁ వేడుదనై,
సత్యము దండ్రికి నెక్కునప్పై, నా
యనుజుఁడు నేలయేలునని,
యక్కడ సన్ముని పాదపద్మవం
దనమనె కృత్య, మిట్లగుట
ధన్యుఁడ; నేనెదఁ గానకేను నీ
పనిచినయట్ల యబ్బురతుఁ
బట్టముగట్టు సవిత్రి! ధాత్రికిన్. ౩౦

ఉ॥ నీకుఁ జరింపశక్యమగునే
శరభోత్కట చండగండకా
నీక తరక్షురంకురురు
నిష్ఠురఘేరవదంతిదంతిభి
ద్భీకరఘోటకారి శలభిత్కిటి
మర్కట పుండరీక భ

ల్లూక వృకాదిఘోర మృగ
లోకము లోపల లోలలోచనా ! ౪౪

క॥ మదనాతురతం బలికిన
యది సత్యంబటు, మహాసభాంతరమునఁ దా
విదితంబుగాఁగఁ బలికిన
యిది బొంకట ; దీనికింక నేమనవచ్చున్ ? ౫౦

క॥ నీకినుకకు నేవెఱతుం
గా, కెవ్వరుగలరు దీనిఁగాదన ? నాచేఁ
గేకయులును గీకయులును
గైకేయికిఁ బూనిరేని గనియెదరుబలే. ౫౩

క॥ ఉల్లము గలఁగఁగ మొగమున
వెల్లఁదనంబొలయఁ దాల్మి వీడంగఁ గడుం
దల్లడ మందుచు నుండఁగ
దల్లికిఁ బ్రణమిల్లి యతఁడు దగ నిట్లనియెన్. ౬౯

ఉ॥ మ్రొక్కినఁ గౌఁగిలించి మదముట్టిన
మోహముఁ ద్రెంపలేక లోఁ
బొక్కుచు వేఁడియూర్పుఁదగఁబుచ్చి
తొడింబడఁ గొంత సేపు వే
ల్పెక్కిన భంగినుండి ధృతి
నెట్టకునేనియుఁ బూని కుత్తుకం
జిక్కెడలించి పుత్త్రిఁగని
చిత్తములోనఁ దలంపు గూడినన్. ౭౫

మ॥ కులనిస్తారకుఁ డీతఁ డిట్లరుగఁ,
గాకుత్థ్సాన్వయం బింతతోఁ
బొలిసెన్, మంథర యింత సేసె, నది
దుర్బోధంబుగాఁ జూడ కి
మ్మొలఁ గైకేయియు నావరంబులడిగెన్
మోహాంధుఁడై రాజు ను
గ్మలికిన్ బాపసహాయుఁ డయ్యె
నకటా! కౌసల్యకుం బం డెఁబో! ౧౧౧

సీ॥ కస్తూరికాపుష్పగంధబంధుర మణీ
బంధ మూఁడిచి జటాభారమూని
కోమలచారుదుకూలంబు లెడలించి
కర్కశ వల్కాంశుకములుగట్టి
పరిలిప్తచందనపంకంబు వోఁజేసి
నిర్మలభసితంబు నిండ నలఁది
మహనీయ బహురత్నమండనంబులు పుచ్చి
లీలమై నక్ష మాలికలు దాల్చి
గీ॥ రాజజూటునోజ రమణీయ తేజోవి
రాజమానమూర్తి రాజకీర్తి
రఘుకులాబ్ధిజనిత రత్నంబు రాజన్య
చక్రవర్తి రామచంద్రుఁ డొప్పె. ౧౧౨

చ॥ అదె రఘువీరుఁడున్న రథ
మల్లదె పోయెడి రాముతేరు పో

మ్మదె యదెపోయె నయ్యరద
మక్కడ దోచెఁ దదీయఘోరజం
బదియునడంగెఁ బొమ్మకట!
హా! గుణరత్నమ! హా! కుమార! హా!
సదమలకీర్తిహార! నృపసత్తమ!
హా! ననుగూడ నీఁగదే! ౧౨౩

చ॥ నడుమిసుమంత మీఁదఁ
గఠిన స్తనభారము తోరమంతకం
దడఁబడు లేతవెన్నడ పదమ్ములు
నూతన పల్లవంబులం
గడచిన కోమలంబు లసికాదె
తను న్నిలుమంటి నింటనేఁ
బడియెడు నెన్నిపాటులనొ
పద్మదళలోచన! చూడు లక్ష్మణా! ౧౨౪

చ॥ అటఁజనికాంచిరంత వసుధాధిపు
లారతిలోలకిన్నరీ
ఘటితగుహాకుటీకనక
కమకవాటము సన్మణిప్రభా
హాటదురు శృంగజూటము
సమావృతమాల్యవతీతరంగిణీ
తటతరువాటముం బహుళ తా
పసకూటముఁ జిత్రకూటమున్. ౧౨౫

మ॥ దళదంభోజ పరాగరాగ విలస
త్కల్లోల కేళీనట
త్కలహంసవ్రజ చక్రసారసబక
క్రౌంచభ్రమద్భృంగ సం
కుల నానారవశిక్షణద్బహుసరః
కూలానుకూలక్రియా
లలితాలోల సమీరకంపిత లతా
లాస్యంబు లీక్షించుచున్: ౧౬౧

శా॥ క్షోణీరాజ్యము నీకునిచ్చి మునియై
ఘోరాటవీవాటి న
క్షీణక్షాంతి వహించియుండఁగ మహా
సేనాసమేతుండవై
ప్రాణద్రోహము సేయ నేగెదవొకో
పాపాత్మ! యిట్లా జగ
త్త్రాణుండల్పుడె? కైక తల్లి యట! నిందం
బొంద నీవోడుదే? ౨౪౯

సీ॥ ఒకపాము మోవంగ నోపునా భూమిని
బార్థివు ముంజేతి బలిమిగాక
యిలకెల్ల దలఁదండ చెలియలికట్టయే
రాజాజ్ఞపై నబ్ధి రాదుగాక
వేదంబులా వర్ణవృత్తి కాధారంబు
జనపతిపాలన శక్తిగాక

యినరశ్ముల వెలుం గిలోకమున కీశు
దీవ్రతేజోదీపదీప్తిగాక

గీ॥ గొడుగువిఱిఁగిన ధారుణిగూలు నబ్ధి
మేరఁదప్పు వర్ణాశ్రమాచార మడఁగు
గలయఁ దబ్బాధ మగునట్లుగాకయుండ
భూరిధారుణిభారంబు పూను మధిప ! ౨౬౫

క॥ ఝణఝణిత కనత్కంకణ
మణిమయమంజీర జనిత మంజులశింజా
రణితనభోభాగనిరీ
క్షణమల్లన సేసి మేనకం బొడఁగాంచెన్. ౩౦౫

చ॥ చెలఁగదొడంగె నీడములఁ జేరి
విహంగము లాశ్రమాంఘ్రిపం
బుల కుదకంబువోసి ముని
పుత్త్రిలు వచ్చిర రోలి వేదికా
తలములఁ బొందెడుఁ మృగవితానము
లబ్జిని నిద్రవోయెడుం
దెలుపుల గ్రింగుచుం దమము
దిక్కులఁ గప్పెడి నంతకంతకున్. ౩౨౦

*N. B.*: ఈ పద్యసంఖ్య వేమూరు వెంకటకృష్ణమశెట్టి అండు సన్సు వారి (క్రీ. శ. 1926) ముద్రాక్షరశాలా ముద్రిత ప్రతినుండి అనఁగా నానందాశ్రమ గ్రంథమాలా గ్రంథమునుండి గైకొనబడినది. వావిళ్ళవారి (1923) ప్రతిలో వీనిసంఖ్య వరుసగా– 62 - 73 - 87 - 109 - 163 - 138 - 140 - 111 - 147 - 232 - 205 - 244 - 277 - 287 - 289 - 377 - 393 - 433 - 448.

## పరిశిష్ట ప్రకరణము

### భాస్కర రామాయణ రచనా విశేషములు

ఈ గ్రంథరచనను బురస్కరించుకొని పుట్టిన కథలకొక హద్దు పద్దులు గానరావు. అందుకుఁ దగినట్లున్న దా గ్రంథరచన. గ్రంథము పేరు భాస్కరరామాయణము. కవులు మాత్రము పెక్కండ్రు. అయినను భాస్కరుని పేరిటనే యా కావ్యమంతయుఁ బేర్కొనఁబడుచున్నది. ఎవ్వఁడా భాస్కరుఁడు? అను విషయమున నెన్నియో వివాదములు చెరిఁగినవి. సుప్రసిద్ధ కవియగు తిక్కనసోమయాజి తన పితామహుఁడగు మంత్రి భాస్కరుఁడు గొప్ప కవియని తన నిర్వచనోత్తర రామాయణ పీఠికలోఁ జెప్పుకొనియున్నాఁడు.

అందుపై నా మంత్రిభాస్కరుఁడే రామాయణకవి యన్నారు కొందఱు. కాని యుద్ధకాండమును బూరించిన అయ్యలార్యుఁడు తన రచనాంతమునఁ దత్పూర్వభాగము హుళక్కి భాస్కరరచితమని చెప్పియుండుటచే నా సిద్ధాంతమునకుఁ గొంత యిబ్బంది వచ్చినది. అందుపై భాస్కరుని పేరనున్న యరణ్య యుద్ధకాండములలో యుద్ధకాండ మొక్కటి హుళక్కి భాస్కర రచితమైన నగుఁగాక. అరణ్యకాండ కవియైన భాస్కరుఁడు తిక్కన పితామహుఁడేల కాఁగూడదు? అని చర్చ సాగించినారు మఱికొందఱు ప్రముఖులు.

నిజస్థితిలో సోమయాజి తనతాత గొప్పకవి యన్నాఁడే కాని యతఁడు పూర్వ రామాయణము రచించుటయే తన యుత్తరకాండ రచనకుఁ గారణమని యెంతమాత్రముఁ జెప్పుకొనలేదు. తన యుత్తరకాండ రచన కాతఁడుచెప్పిన కారణము వేఱు. ఇప్పట్టునఁ దిక్కన యుత్తరరామాయణరచనాకాలమును గూర్చి యించుక చర్చించిచూతము.

తిక్కన శా. శ. ౧౧౨౦ కి సరియగు కాళయుక్తి సం భాద్రపదమాసమున నిర్యాణము చెందినట్లు తెలియఁజేయు పద్యమొకటి వాడుకలో నున్నది.

కం. అంబర రవిశశి శాకా
బ్దంబులు చనఁ గాళయుక్తి భాద్రపదపు మా
సంబున నంబగమణి బిం
బం బనఁదగు తిక్కయజ్వ బ్రహ్మము చేరెన్.

ఇదే సత్యమగునేని తిక్కన శా. శ. ౧౧౨౦ కి సరియగు క్రీ. శ. ౧౧౯౮ కాళయుక్తిలో మరణించినట్లు చెప్పవలసి యుండును. కాని యాలోపల నాతని యుత్తర రామాయణ కృతిపతియగు మనుమసిద్ధిరాజు పుట్టియైన నుండఁడేమో ! అని సంశయింపవలసి యున్నది. ఏలయన ? మనుమసిద్ధి తండ్రియైన తిక్కభూపాలుఁడు క్రీ. శ. ౧౨౩౫-౩౬ లో వేయించిన కాంచీపురశాసనములను బట్టి యాతనిమరణము దాని కీవలిది గావలె. తరువాత రాజ్యమునకు వచ్చినవాఁడు మనుమసిద్ధి రాజు. ఆతఁడు సింహాసనమెక్కి కొన్ని శత్రువిజయములు కూడ సాధించిన పిమ్మటనే యుత్తర రామాయణము రచింపఁ

బడినట్లు తత్ప్రతికవలన తెలియుచున్నది. కనుక నా కావ్య రచనా కాలము క్రీ. శ. ౧౨౪౦ కి లోపలిది మాత్రము కాఁజాలదు.

పై పద్యము ప్రకారము తిక్కన క్రీ. శ. ౧౧౯౭ కి లోపలనే మరణించి యున్నచో నీ యుత్తర రామాయణ రచన కవకాశ మెక్కడిది ? కనుక నిది యసత్యము. లోక వ్యవహార ములోఁ దిక్కన మరణకాల నిర్ణయము వంటి నిర్ణయములను జేయు పద్యాదు లెన్నో యున్నవి. సాధనాంతరముల వలన నవి తప్పిపోవుచున్నవి. అందు ముఖ్యముగా శకాబ్దములు మాత్రమే తప్పుచున్నవి. వాని కఱువది సంవత్సరములు చేర్చుటయో త్రోచుటయో జరిగినయెడల సరిపోవుచున్నవి. కనుక దిక్కన నిర్యాణము శా. శ. ౧౧౮౦ గా నవరించు కొందు మేని యది క్రీ. శ. ౧౨౫౮ కి సరియైనదగును. అదియుఁ గాళయుక్తి సంవత్సరమే యగును. ఈ విషయములో సంవత్స రాదికము విన్ననిపుణుఁ డెవఁడో దానికిఁ దానూహించు శకాబ్ద ములు గూర్చుటలోఁ బొరపాటుపడెనని మనము తలంప వచ్చును. తిక్కన మరణకాలమునకు ౭౦ సంవత్సరముల యీడు గల వాఁడనుకొన్న నాతని జన్మకాలము క్రీ. శ. ౧౧౮౮ అనియు నిర్యాణకాలము ౧౨౫౮ అనియు నిశ్చితమగును. ఇట్లనుటలో చారిత్రకవ్యతిరేక మేమియుఁ గానరాదు. ఈ పక్షమునఁ నుత్తర రామాయణ రచనాకాలము బహుశః క్రీ. శ. ౧౨౪౦ గావున నప్పటి తిక్కన వయసు ౫౨ సం॥ లనఁదగును. మనుమసిద్ధి యానాఁటికి ౪౦ సంవత్సరముల వాఁడనుకొన్న

వారి మామలల్లుండ్ల వావియు సరిపోవుచున్నది. ఈ దృష్టితో మన చారిత్రమును గొంత పరికింతము—

నేను పలుమాఱు నిందుఁ బేర్కొనుచున్న తెలంగాణా శాసనసంపుటిలో బూదుపూరి శాసనమొకటి మనకీ విషయమునఁ గొంత సహాయపడఁగలదు. అది శా. శ ౧౧౯౮ లో ననఁగా క్రీ. శ. ౧౨౭౬ లో మల్యాలగుండ దండాధ్యక్షుని భార్య కుప్పమాంబ తన భర్త మరణ నిమిత్తముగా జేసిన కొన్ని దానధర్మములఁ దెలుపు శాసనము. అందామె యా ధర్మములను దన కుమారులైన (౧) బాచయబొప్పండు (౨) గణపతిదేవండు (౩) పర్వతము మల్లయ్య అను వారితోఁ దన తమ్ములు (౧) మల్లయ్య (౨) బుద్ధయ (౩) విట్ఠయ (౪) కాటయ కొడుకు గుండియ అను వారితో సహా చేసినట్లు చెప్పుకొన్నది. ఈ శాసనకాలమున కామెకు సాధారణముగా ౫౬ సంవత్సరము లుండుననుట కభ్యంతరమేమియుఁ గానరాదు, తరువాతఁ గుప్పాంబ తన వంశనామమును దండ్రి పేరును నీకింది—

శ్లో॥ శ్రీ గోనవంశ నిజశేఖర బుద్ధయాఖ్యా
పుత్రీ పవిత్రచరితా భరితాగుణాఘైః
శృంగార సారసరణిః కరణీయదక్షా
కుప్పాంబికాఽజని చ తస్యసతీ కళత్రం.

అను శ్లోకమునఁ దెలుపుకొన్నది. కుప్పాంబ తండ్రి గోనబుద్ధారెడ్డియట. ఈ బుద్ధారెడ్డి రామాయణ ద్విపద కర్తయో, కారయితయో యేల కాఁగూడదు? అట్లయినచో నతఁడు

శాసనకాలము వఱకు జీవించి యుండినను నుండవచ్చును. అనఁగా నతఁ డప్పటి కెనుబది సంవత్సరములకు మించిన వాఁ డనుకొనఁ బనియుండదు.

మనకంత పనిలేదు. తిక్కన యుత్తరకాండ రచనా కాలమని మనమనుకొన్న ౧౨౬౦ నాటి కాతఁడు ౬౬ సంll ల యీడువాఁడై యుండునను నంతచాలును. అట్లయిన నాతని ద్విపదరామాయణ రచనను జూచియే మనుమసిద్ధి కోరుటయుఁ దానా కావ్య రచనకుఁ బూనుటయుఁ దిక్కనకుఁ దటస్థించి యుండవచ్చును. పూర్వ రామాయణ మేరూపముననో తెలుగు లోనికి వచ్చినది కనుకఁ దిక్కన యుత్తర రామాయణ రచనకుఁ బూనెననుటలో యుక్తివైరుధ్యమేమియు నుండదు.

ఇఁక భాస్కరరామాయణ రచనాకాలమునుగూర్చియుఁ దన్నామవ్యాప్తిని గూర్చియుఁ గొంత విచారింతము,

సోమదేవ రాజీయమువలన (గాకతి) ప్రతాపరుద్రుని సభలో భాస్కరాదులైన ౨౦౦ మంది కవులును, సాహిణి మారన్నవంటి యోధులును గలరని తెలిసినదికదా ? అందుఁ బ్రథముడుగాఁ జెప్పఁబడిన భాస్కరకవి వయస్సుచెల్లినవాఁడును, బ్రఖ్యాతుఁడునై యుండవలె. కనుకనే యతడు సకలసుకవి జనవినుత యశస్కరుఁడనని చెప్పుకొనఁదగియుండెను.

సాహిణిమారన్న యాతనిచే దశగతులను గ్రంథమును వ్రాయించి దాను గృతిఁబొందియుండెను గావున నాతనితోడి సంబంధము రామాయణ రచనారంభమునకు ముందే యతనికిఁ గలిగియుండినట్లు తేలినది.

మారన్న రుద్రమదేవి రాజ్యారంభము పిమ్మటఁ గొలఁది కాలములో నామెకును దేవగిరి మహాదేవయాదవునకును జరిగిన యుద్ధములోఁ జాళుక్య చొక్కరాజుతోఁ బోరాడి యుద్ధమరణమును జెంది యుండవచ్చును. చాళుక్య చొక్కరాజుయొక్క రాజధానియని నిశ్చితమైన రామగిరి దుర్గము కాకతీయ రాజధానియగు నోరుగంటికిని యాదవ రాజధాని యగు దేవగిరికిని మార్గమధ్యమునఁదే యున్నది. ఈ కాకతీయ యాదవ యుద్ధమునందు రుద్రమదేవి సవతికొడుకులగు హరిహరదేవ మురారిదేవులేకాక యామె భర్తయగు చాళుక్య వీరభద్రుఁడు సైతము మాఁడుది రాజ్యాధికారిణి యగుటకు సమ్మతింపక ప్రతిపక్షము పూనిరని కొన్ని సాధనములవలనఁ దెలియవచ్చుచున్నది. కావునఁ జాళుక్యుఁడగు చొక్కరాజు యాదవ పక్షీయుఁడనుటయు యుక్తిసహమైన మాటయే యగును. ఆతనితోఁ బోరాడవలసివచ్చుట కాకతీయ సేనాని యగు మారన్నకును సాధారణ విషయమే యగును. భీమకవికిని జొక్కరాజునకును గల సంబంధమునుపట్టి యాతఁడు సాహిణి మారన్నను శపించె ననుటయు విరుద్ధము గాదు.

ఇట్లు చూచిన సాహిణి మారన్న మరణకాలము క్రీ. శ. ౧౨౬౨-౬౩ లోపలిదిగాఁదగును - మారన్న జీవిత కాలములోనే దశగతులు రచించి తత్ప్రేరణమున హుళక్కి భాస్కర కవి రామాయణ రచనకుఁ గూడఁ గడంగి యుండవచ్చును. కాని యా మారన్న యుద్ధమరణముతో నది యాగియుండి తరువాత ప్రతాపరుద్రుని కాలమున నా కావ్యరచన పూర్తియై యుండ

వచ్చును. ఇన్నిటికిఁ దగినట్లు భాస్కరుని వయస్సు నిర్ణయింప వలెనన్న నది యీ క్రింది విధముగాఁ జెప్పఁదగి యుండును. భాస్కర కవి సాహిణి మారన్న మరణకాలముగా నూహింపఁదగిన క్రీ. శ. ౧౨౬౦-౬౨ నాటికి ౮౦ సం.ల వయస్సువాఁడై యుండును. రామాయణ రచనారంభ కాలమని మనము తలంచిన క్రీ. శ. ౧౨౭౦ నాటి కాతఁడు ౯౦ సం.ల వయోవంతుఁడై యా వయస్సును బట్టి పుత్ర మిత్ర సాహాయ్యమును గోరి కావ్య రచన సాగింపవలసిన వాఁడుగా గూడ నుండవచ్చును.

ఇతిశ్రీః

